# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్యసౌభాగ్యములను పెంపొందించుట
కేర్పడిన సచిత్ర మాసపత్రిక

సంపాదకుఁడు :

డాక్టరు కే. యన్. కేసరి

# GRIHALAKSHMI

ఏప్రిల్, 1949.

సంపుటము ౧౮] [సంచిక ౪




### సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు.4-8-0. అర్ధసంవత్సరపు చందా రు.2-8-0. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతిలేదు. విడికాపి ఆరు అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువమేరకు తపాలాబిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

### ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీలకందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుటకీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువయైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది.

### వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమైయుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్ర ప్రచురణకు వీలగును. ఒకేప్రక్క సిరాతో స్పష్టముగ తప్పులులేక వ్రాయవలెను. భాష గ్రాంధికముగాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వహక్కులు గలవు. ప్రకటింప నంగీకరింపబడినపుడు మాత్రము రచయితల కట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

### సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

### చిరునామా మార్పు

చిరునామాయందు మార్పుఉండుచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

### ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయును. చెక్కులు,మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం లిమిటెడ్' పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.

# గృహలక్ష్మి ఏజంట్లు:



గుంటూరు: వెల్కం & కో.
కర్నూలు: బాలసరస్వతి బుక్ డిపో.
బెజవాడ: మాడరన్ న్యూసు ఏజన్సి.
కాకినాడ: పి. సాంబయ్య
అనంతపురము: వై. సాంబయ్య.
భద్రాచలం: టి. వి. జి. ఆర్. మూర్తి.
దొమ్మగూడెం: సి. హెచ్. బాపనయ్య.
నర్సాపూరు: వై. సుందరరామయ్య.
కావలి: జి. రంగయ్య.
మూరుటేరు: వి. వి. సుబ్బారావు.
గుడివాడ: యం. రామమూర్తి పంటు.
పిఠాపురము: యం. సూర్యరాజు.
కళ్యాణదుర్గం: కె. మల్లప్ప.
నిడదవోలు: కె. సి. సి. అయ్యర్.
మచిలీపట్నము: టి. బి. నారాయణశింగ్.
ఏలూరు: నేషనలు బుక్కుడిపో.
రాజమండ్రి: నేషనల్ ఏజెన్సీస్.
తుని: కోడూరు సూర్యరాజు.
బరంపురం : కె. వి. రంగారావు.
విశాఖపట్నం: కె. సుందరేశ్వరరావు.
కనిగిరి: కె. యస్. శాస్త్రి
పర్లాకిమిడి: బి. యన్. మూర్తి.
ఇచ్ఛాపురం: కె. గంగయ్య
బళ్ళారి: యస్. గురునాథ్
అనకాపల్లి: పి. వీరునాయుడు.
విజయనగరము : పి. నారాయణప్పడు.
ఆకీడు: వి. లక్ష్మీనారాయణ

భీమవరం: యన్. సూర్యనారాయణ.
పొన్నూరు: చౌదరి ఖాదీస్టోర్సు
మదనపల్లి: యన్. రాధాకృష్ణయ్య
అంబాజీపేట: పి. రామమూర్తి.
చికాకోలు: బి. యన్. మూర్తి.
వసంతవాడ: యస్. కె. శర్మ.
ఖర్గపూరు: యస్. వి. నాయుడు.
పార్వతీపురము: ఎ. వి. వి. యన్. మూర్తి.
తిమ్మనచర్ల: రాయలసీమ న్యూసుమార్టు.
వాల్తేరు: సిటి న్యూస్ ఏజన్సి.
చల్లపల్లి: బి. ఆంజనేయులు.
జగత్యాల: కాసం, శివరాజగుప్త & సన్సు.
రంగూన్: శేషనలుస్టోర్సు.
ఎలమంచిలి: కె దేముళ్ళు.
బాపట్ల: యల్. వి. మనోహరరావు.
నర్సీపట్నము: సి. రామం.
జంషెడ్పూర్: యం. శ్రీరాములు.
తాడేపల్లిగూడెం: జి. సూర్యరావు.
మహబూబ్ నగర్ : ముత్యాలు & సన్సు.
వేలూరు: ఎ. వెంకటశాస్త్రిగారు.
హైదరాబాద్ : నవ్యాంధ్రా ఏజన్సీస్.
కదిరి: జి. సి. కోదండరామయ్య.
గోకవరం: వి. వి గోపాల్ రావు.
పామర్రు: జి. లక్ష్మయ్య.
ఛత్రపురం: వి. వి. రంగాచారి
డోర్నకల్లు : కె. జె. జి. సుందరం.
చోడవరం : పి. విశ్వేశ్వరరావు.
తిరుపతి : ఆర్. చంచల్ రావు
చీరాల. పి. సూర్యనారాయణ

హిగ్గిన్ బాథమ్ స్టాలులవద్ద దొరకును.

ఇతర చోట్లకు ఏజంట్లు కావలయును; డిపాజిటుతో దరఖాస్తు పంపుకొనుడు.

# విషయసూచిక



ఈవ్యక్తి "గృహలక్ష్మి" పాఠకులకు చిరపరిచితమే! అయితే ఎవరు?

ముందు తెల్పువారికి ఉగాది బహుమానము




జయజయ గృహలక్ష్మి సఖీ! జయజయ లలితాంధ్ర మధుర సారస్వతమా!
జయజయ లలనా రత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయ కల్యాణీ!

---

## ఉగాది

ఉగాది పండుగను ఉత్సాహముతో చేసుకొని బంధుమిత్రులతో సుఖసంతోషాల నోలలాడిన ఆంధ్ర గృహలక్ష్ములకు, "గృహలక్ష్మి" పాఠకులకు - "గృహలక్ష్మి" ఉగాది అభివందనాల నానందంతో అందిస్తున్నది.

ఉగాది పండుగతోనే కొత్త సంవత్సరము కొత్త ఆశలతో, కొత్త ఆశయాలతో, కొత్తఊహాలతో, కొత్త వ్యూహాలతో, కొత్త పాడిపంటలతో, కొత్త భాగ్యభోగాలతో, కొత్త పన్నులతో, కొత్త చట్టాలతో, కొత్త సమస్యలతో, కొత్త సన్నాహాలతో - అంతా కొత్తతళుకొత్త మన జీవితాల నలుముకొన్నది.

చిరకాల వాంఛితమైన ఆంధ్రరాష్ట్రసిద్ధి ఉగాదినాటికి అటో ఇటో తేలిపోతుందనుకున్నాము. కాని నూతన సంవత్సరారంభంలో కాంగ్రెసు కార్యనిర్వాహకవర్గంవారు సమ్మతించిన పట్టాభి పటేలు నెహ్రూ కమిటీరిపోర్టు - ఆ ఆశను తుంచడంలేదు; ఇంకా పెంచుతున్నది.

క్రొత్తసంవత్సరము పేరు విరోధియట! దీని పేరుఫలాలు అంత సౌకర్యమైనవిగా కన్పించవు. అయితేనేమి, అన్నివైరుధ్యాలను సమర్థించుకోగల శక్తి "గృహలక్ష్మి" సొమ్ము. ఒకచోటపుట్టి ఒకచోటమెట్టి - క్రొత్తజనంతో క్రొత్తవావి వరుసలు కల్పించుకొని అత్తమామలను, ఆడుపడుచులను, తోడికోడండ్రను, బావమరుదులను, బంధుమిత్రులను అతిథిఅభాగ్యతులను దాసదాసీలను - వారివారి కుచితమైన మర్యాద మన్ననలతో అప్యాయము ఆదరణలతో, పెట్టుపోతలతో - సకల వైరుధ్యాలను సరిదిద్దుకొని - సంసారయాత్రను చిరునగవుతో గడిపే చల్లనితల్లి - గృహలక్ష్మి - ఒక్కసంవత్సరకాలంలో గిర్రునతిరిగిపోయే "విరోధి" నామసంవత్సరము నిన్నేమిచేయును? నడుమున కొంగు బిగించి వీరోత్సాహంతో, ఉద్యోగోద్రేకాలతో ముందుకు నడుతువుగాక. దీనివెంట 'వికృతి' యట; ఆ వెంట 'ఖర' యట! ఆపిదప హితకరమైన నందన, జయ, విజయ!! వాటి నందిపుచ్చుకోవాలనే - ఆశతో ఆశయంతో, గృహలక్ష్ములంతా ముందుకురికి 'జయా, విజయీభవ' అని 'విరోధి' నెదుర్కొందురుగాక.





బాపట్ల స్త్రీ హితైషిణీమండలిలో శ్రీ కాటూరి వెంకటేశ్వరరావుగారిచే 30-1-49 న గాంధీ శిలావిగ్రహం ప్రతిష్ఠింపబడినది. శిలావిగ్రహము ను ఊరేగింపుతో కొనిపోవుచున్న దృశ్యము.



# మాతృభూతేశ్వర —
# కుంభాభిషేక మహోత్సవము

మనదేశములో దేవాలయ ప్రతిష్ఠలు అరుదు. కనుక ఇది యేమో చూతమని నాకు ఆశ మెండుగనుండి ప్రారంభసమయముననే ఉండ ప్రయత్నించినను రెండవదినమునఁగాని చేరలేకపోయితిని.

మునుపు రమణుఁడు కొండమీద నుండువాఁడు. వారితో వారితల్లి యళగమ్మ యుండెడిది. తపస్విని. సకల సద్గుణరాశి. అపునరావృత్తిపదమున కర్హ యని భగవానుఁడు శ్రీరమణుఁడు ఆమె కాస్థాన మీయ తలంచినాఁడు.



1922 లో ఆమె దేహమును త్యజించుసమయమున భగవానుఁ డామె హృదయమున, శిరమున కరములుంచి ప్రాణముల నుద్గతముల కానీయక యంతర్యామియందే యడగిపోవునట్లు తన శక్తిచే చేసినాఁడు, కనుక నా జీవి కర్మవాసనలు నిశ్శేషములై ఆత్మయందే లీనమై బ్రహ్మీభూత మయినది. ఆ దేహము పావనమని యతిశరీర తుల్యమని అరుణాచలము దక్షిణపాదమున పాలితీర్థముచెంత సమాధిగతము చేసినారు. ఆ సమాధిపై 'మాతృభూతేశ్వర' నామకలింగమును స్థాపించినారు.

ఇటీవల పదియేండ్ల క్రిందట ఆ చోట నొక దేవాలయమును నిర్మింపవలెనని సర్వాధికారి చిన్నస్వామిగారు సంకల్పించినారు. శ్రీభగవానులు ఆశీర్వదించినారు. ఇక సహాయ సంపత్తులకేమి

కొదువ. దేవాలయమును కొంతరాయిచే కట్టుట ప్రారంభ మయినది.

ఆ లింగమును నిర్మాణకాలమున వేటొక గది యందుంచి నిత్యపూజాకలాపమును నెరవేర్చుచుండినారు. దేవాలయము సంకల్పితమైన తరువాత దేవీ ప్రతిష్ఠకూడ చేయవలెనని తరువాత అయిదేండ్లక్రింద 'యోగాంబా' ప్రతిమను స్థాపించినారు. ఆది నుండియు కావ్యకంఠ గణపతి శాస్త్రులవారి యాదేశానుసారము భగవానుని యాజ్ఞమేరకు శ్రీచక్రమును భూప్రస్తారమున రాగిరేకుపై లిఖియించి పూజ నెరవేర్చుచుండినారు. శ్రీభగవద్రమణుని పటమును పూజించుచున్నారు.

కొత్తగ గట్టుచుండిన దేవాలయము భగవదనుగ్రహమున పూర్తి యయినందున నీ నెల 14 వ తేదినుండి 17 తేది వరకు కుంభాభిషేక మహోత్సవమును సంకల్పించినారు.

కుంభాభిషేకమున చిరుతమందిరమునఁ బూజలగొనుచుండిన నీ మూర్తులను నూత్నమందిరమునఁ జేర్చుకలాపము లింగము సమాధిపై యథాపూర్వ ముంచుట. శ్రీచక్రమును దాని క్రిందనే స్థాపించినారు. దానికి వెనుక ఇంకొక శ్రీచక్రమును మేరు ప్రస్తారమున ప్రతిష్ఠితమును జేసినారు. విఘ్నేశ నటరాజ కార్తికేయ మూర్తులను నవగ్రహములను స్థాపించినారు.

ఈ క్రియాకలాపమునకుఁ బూర్వాంగము మహా గణపతిపూజ, చండీయాగము. ఈ కుంభాభిషేకమున విశేషము అగ్నిముఖముగ సర్వహోమములు జరిగి వైదికమార్గమునను ఆగమమార్గమునను రెండు విధముల దేవీకళాకర్షణము జరిగినది.

మొదటిదినమున స్వామిని వైదికబ్రాహ్మణము నివృత్తిపరక శ్రుతిఘోషముతో గోశాలనుండి దేవాలయముముందు (దానికి ముఖమంటపమురీతిగా) కట్టబడిన హాలునకు దోడ్తెచ్చినారు. స్వామి క్షణక్షణమునకు తేజోవిశేషముతో విరాజిల్లుచుండినారు.



నూత్నముగ కొండశిలతో స్వామికిగా యోగాసనమును నిర్మించినారు. యోగాసనమున పద్మమును అనుకొను ప్రణవమును జెక్కి బంగారు నీరమును పూసినారు. ఆసనమున కిరుకొనల సింహములు వానికిని బంగారు నీరు పూసినవి రాతిలోనే మలిచినవి రంగారుచున్నవి. స్వామి యందాసీనులు కాఁగానే అందఱు సాష్టాంగములగావించి ప్రారంభమున కనుజ్ఞ గైకొన్నారు.'

ఈ పాటికి ఆశ్రమమున వేలజనులు నిండియున్నారు. బయటి యూరుల వారికిగా రెండు పెద్ద పెద్ద యతిథిశాలలు, స్త్రీలకుగా వేరొకటి వేయబడినవి. నీరమునకు Tubewell వేయించి ఇంజనుద్వారా నీరము పైకి తేఁబడుచుండినది. అన్నిచోట్లను తళతళలాడుచు విద్యుద్దీపములు మెఱయుచుండినవి. వైదికయాగశాలకును ఆగమయాగశాలకును చుట్టును శివలీలానృత్యచిత్రములు అలంకారముగా నుండినవి. వచ్చువారికెల్ల అన్నమిడుటకు తగిన యేర్పాట్లయినవి.

ప్రారంభమున చండీయాగము శాస్త్రోక్తముగ వైదికయాగశాలయందుఁ నిర్వర్తింపఁబడినది. అన్నిచోట్ల అన్ని పరివారదేవతాహ్వానములు కలశస్థాపనలు అయి హోమాగ్నులు విరాజిల్లినవి. ఈ హోమములుగాక చతుర్వేదములను వైదికులు నాల్గుజట్లవారు పారాయణము జరిపిరి.

రెండవనాడును ఇట్లే హోమములు జరిగినవి. భగ

వానుఁడు మొదట గోల్డన్ జూబిలీహాలు నందును, తరువాత నూత్న దేవాలయము వెనుకను, సాయంకాలములు గోల్డెన్ జూబిలీహాలునందును వచ్చుజనసహస్రములకు దర్శన మొసగుచుండెను. మూడవరోజు శుభకాలమున కళాకర్షణము జరిగినది. నవరత్ననిధులపై మూర్తులను బిగించినారు.

నాల్గవరోజన్నింటి ప్రధాన దినము. తెల్లవారుసరికి యాగములు త్రిరాత్ర దీక్షలతో సాంతమయి నవిగావున పూర్ణాహుతు లీయఁబడినవి. ఉదయమున కలశములను దేవాలయములోనికి దీసికొనిపోయి శక్తిన్యాసము మూర్తులందు కావింపఁబడెను. తర్వాత స్థళపతులు పూర్ణకలశోదకములతో విమానశిఖరమునఁ బ్రతిష్ఠితము కావించిన కలశమునకు అభిషేకము గావించిరి. తరువాత సాయంకాలమున్ లోని లింగమునకు మహాభిషేకము జరిగినది. Police Inspector-General సి. క. విజయరాఘవన్ గారి తనూజలు సంగీత కచ్చేరి జరిపిరి.

ఈ యేర్పాట్లకుఁ గారణభూతులైన వారియుత్సాహము, సేవాసక్తి, విశ్రాంతి యెఱగనిదీక్ష. స్వామియెడలభక్తి, చిన్నస్వామియెడల రక్తి ప్రశంసార్హములు. మానస్వామిగారు, తల్యార్ ఖాన్ గారు, స్వామినాథయ్యర్, తొప్పయ్యముదలియార్ వాల్లు చేతులవలె చిన్నస్వామి కీ కార్యనిర్వహణమునఁ దోడ్పడిరి. పోలీసు వారు, అనేక పాఠశాలల స్కౌట్లు, వాలంటీర్లు, శతాధికులు, ఆశ్రమవాసులు అహోరాత్రములు శ్రమపడి కార్యమును జయప్రదము గావించిరి. స్త్రీలకుగా నియమితులైన వాలంటీర్లను మిస్ మెక్ స్టను, శ్రీ సూరినాగమ్మ, అలిమేలమ్మ, కామాక్షిఅమ్మ చాల కష్టముపడినారనిచెప్పక తప్పదు.

(ఒక యాత్రికుడు)

---

## బత్తెపెరుగు

(ఒంగోలులో నొక కవి చెప్పినది)

తెల్లనై యమృతంపు దీప్తిని విలసిల్లి భాసిల్లుచుండు నేబత్తెపెరుగు
గట్టిగా ముద్దలై కన్నుల కిష్టమై భ్రాంతిఁ బుట్టించు నేబత్తె పెరుగు,
మేహంబు శాంతించు మెత్తనౌ దేహంబు బొజ్జలు పెరిగించు బత్తె పెరుగు
ఆకలి బుట్టించు నన్నంపు రుచిబెంచు పైత్యంబు హరియించు బత్తె పెరుగు
బక్క వారిని బలిపించు బత్తె పెరుగు బ్రాహ్మణుల కిష్టమైనది బత్తె పెరుగు
పరగ నీలాద్రిహరిప్రీతి బత్తె పెరుగు పరమ సౌఖ్యంబు నిచ్చు నేబత్తె పెరుగు.

(సుబోధిని)

# జో హా రు లు

ఇదివరకు స్వర్ణకంకణ గృహీతలైన నారీమణులందరు ఒకయెత్తు, ఈసారి స్వర్ణకంకణ గృహీతలైన శ్రీమతి బెంగుళూరు నాగరత్నమ్మగారు ఒకయెత్తు. ఇదివరకటివారు కవయిత్రులుగనో, విదుషీమణులుగనో, లేదా సంఘసేవా పరాయిణులుగనో ఉండిరి. కాని బెంగుళూరు నాగరత్నమ్మగారో? విద్యాసుందరి, గానకళా విశారద. దీనికితోడు కొమ్ములుతిరిగిన మగవాళ్లు సహితము తలపెట్టని, సాధింపలేని, శ్రీ త్యాగరాజ స్వామివారి సమాధి నిర్మాణమును సాధించుటయేగాక, అచట నిరంతరపూజాని వేదనాదులు శాశ్వతంబుగ జరుగుటకుతగుస్థిరాస్తు లేర్పరచిరి. ఈమె బహు భాషావేత్త. కన్నడమే మాతృభాష ఐనప్పటికి, తెలుగు నందును, సంస్కృతమునందును చక్కని పాండిత్యమును సంపాదించిరి. ఆంగ్లమునకూడ ప్రవేశముకలదు. డెబ్బదియేండ్లు నిండినను శారీరములో ఏవిధమైన మార్పుకనబడదు. స్వర్ణకంకణ ప్రదానోత్సవమునాటి ఈమె ఉపన్యాసము మరువ రానిది. అది అనర్గళ ప్రవాహము. ఈమె చమత్కారము వర్ణనాతీతము. అందుకు నిదర్శనము ఆ నాటి సభకు విచ్చేసిన స్త్రీ పురుషులు పొట్టలు చెక్కలయ్యేటట్లు నవ్వుటయే! కళావంతుల కులమున జన్మించినను 'కులముప్రధానమె గుణములేకునికి, కలశాబ్ధిపుట్టదే కాలకూటంబు' అనుకవినానుడులను సార్థకపరచిన నారీశిరోమణి. ఈమె దానకర్ణులైన శ్రీ కేసరిగారి స్వర్ణకంకణ ప్రదానమునకు సర్వవిధముల తగినది. ఈమెకు నాజోహారులు!

సో. రామచంద్ర అగస్త్య

# విజ్ఞప్తి

శ్రీ శ్రీ శ్రీ భావనగరం మహారాణీసాహెబ్‌గారు అధ్యక్షురాలుగాగల
భారత మహిళాసంఘమువారు (అ. భా. మ. సంఘశాఖ)
కాన్సర్ వ్యాధినిగూర్చి ఈ క్రింది విజ్ఞప్తిచేయుచున్నారు :

మానవ జాతిని హెచ్చుగా పీడించుచున్న భయంకరమైన వ్యాధి కాన్సర్ (Cancer) అను మహావ్రణము. పురుషులకన్నా స్త్రీలే హెచ్చుగా దీనికి బలి అగుచున్నారు.

మానవులకువచ్చు వ్యాధులన్నిటిలో నిది చాలా బాధకరమైనది; హెచ్చుగా జనమును చంపుటలో నిది రెండవది.

కాన్సర్‌వ్యాధి కుదుర్చుటకు సాధ్యమైనదికాదు - అని తరుచుగా అంటారు; అది నిజముకాదు. త్వరగా కనుక్కొన్నట్లైతే క్షయవ్యాధివలెను, కుష్టవ్యాధివలెను అది కుదుర్చదగినది. సాలీసా జనరల్ ఆసుపత్రిలో 4000 కేసులును, ఎగ్మూర్ మెటర్నిటీ ఆస్పత్రిలో 800 కేసులున్నూ చేర్చుకొనబడుచుండును; వానిని వ్యాధి చాలా ముదిరిన పిదప తీసుకొనివత్తురు; కావున ప్రాణాపాయమే కల్గుచుండును. ఈ వ్యాధి లక్షణములు సరిగా ప్రజలకు తెలియకపోవుటచేతనే సకాలమున వైద్యసహాయమును పొందరు.

ఇటీవల మద్రాసు నగరములోనే, గొప్ప ఇండ్లలో మా స్నేహితురాండ్రు కొందరు, డజనుమందికి పైగానే, ఈ వ్యాధివల్ల మరణించియుండిరి; పేదసాదల ఇండ్లలో ఇంకెంతమంది ఇట్లా బాధపడుచున్నారో - తెలియదు. ఈ వ్యాధిని కుదుర్చుటకు వలయు సాధన సంపత్తిని ఒకచో కేంద్రీకరించినట్లైతే దీనిని నివారింపవచ్చును-అని పాశ్చాత్యదేశములలో అందరున్నూ తెలుసుకొన్నారు. ప్రత్యేకము అందుకైన సాధనము లన్నీయున్న వైద్యాలయము లందుబాటులో యున్నట్లైతే, త్వరగాను, సరిగాను ఈ వ్యాధి స్థితిగతులను కనిపెట్టుటకు అవకాశము కలుగుచున్నది. ఈ వ్యాధినిగూర్చిన పరిశోధన, నిదానము, చికిత్స మూడును చక్కగా సమన్వయమై సాగవలెను. అయితే కేవలము సంస్థలకన్నను, ఈ విషయమున ప్రత్యేకముగా తర్ఫీదునందిన ప్రవీణుల అవసరము చాలా ముఖ్యమైనది.

మానవ జాతిని విరుచుకొని తినుచున్న ఈ ఘోరమైన క్రూరవ్యాధిని నిర్మూలించుటకు సర్వసంపూర్ణమైన "కాన్సర్ వైద్యాలయము" ఇతర సదుపాయములును మన నగరమునందుండు ఆస్పత్రులలో కానుపించవు. బొంబాయిలో ప్రత్యేక మీ వ్యాధికొరకు టాటా మెమోరియల్ ఆసుపత్రికలదు. కలకత్తాలో చిత్తరంజన్ ఆసుపత్రియున్నది. దురదృష్టవశమున మద్రాసు ఈ విషయమున చాలా వెనుకబడియున్నది. ఈ వ్యాధిబాధ భరింపజాలక ఆక్రోశించి మరణించిన వారి ఆత్మలు ఇతరులనైన కాపాడుడని గొంతెత్తి కోరుచున్నవి. మన వైద్యవిద్యాలయమున కంటిన ఆసుపత్రులలో వ్యాధి ముదిరిన కేసులు, వ్యాధిలేతలోనున్న కేసులు- ఉంచుటకు పడకలుగాని, మన విద్యార్థులను పోస్టుగ్రాడ్యుయేట్లను తర్ఫీదు గావించుటకు ఇతర సాధన సంపత్తిగాని లేవు. రేడియంయున్నూ తీవ్రమైన యక్స్‌రేయున్నూ జాడ్యము లేతలో నున్నప్పుడు కుదర్చగలుగుచున్నవి.

కాబట్టి మానవజాతికే శత్రువైన ఈ వ్యాధిని నిర్మూలించుటకు ప్రభుత్వమున్నూ ప్రజలున్నూ ఇప్పటి కెప్పుడో కలిసి కృషిచేయవలసి యుండెను. కావున, కాన్సర్ చికిత్సా శిక్షణాలయమును, కాన్సర్ వైద్యాలయమును ఏర్పాటు చేయుటకై, పౌరులెల్లరు, ముఖ్యముగా నీ వ్యాధివల్ల బాధపడ్డవారి అవస్థల చూచినవారు, భూరివిరాళము లివ్వవలయునని కోరుచున్నాము.

రు 5000 లు ఆపైన ఇచ్చువారు పోషకులు; అట్లే రు 1000 మొ॥పైన దాతలు విశేషపు యావజ్జీవసభ్యులు; రు 500 మొ॥ పైన దాతలు సాధారణ యావజ్జీవ సభ్యులు; రు 25 మొ॥ పైన దాతలు సభ్యులు.

———:o:———

# గృహలక్ష్మికి పద్యరత్నాలు

శ్రీ కల్లూరి అహోబలరావుగారు

[ఫిబ్రవరి సంచికతరువాత]

చిఱునవ్వున ముదమలరఁగ కర మనురాగంబు వెలయఁ గాంతునిఁ గనుచున్
దరిఁజేరి యతని కోర్కెల నరయుచు వర్తిల్ల మంచిదగు ; గృహలక్ష్మీ !

పనిపాటుల నొనరిచి నెమ్మనమలయఁగ విభుఁడు రాగమందిరమునకున్
గనుఁగొని యాతని యలసట ననువున యాదరణ నొసగుమా గృహలక్ష్మీ !

వెచ్చని నీరం బొసఁగుము మచ్చికతో స్నానమాడ మానిని ! అన్నం
బిచ్చియు నాకలిఁదీర్పుము సచ్చరితవటంద్రు నిన్ను ; జయ గృహలక్ష్మీ !

మితమగు హితమగు పలుకులఁ బతితోడుత ముచ్చటింపఁ బాడి ; యతనితో
హితమునఁ గూడుము రాత్రుల మతివంతుల కిదియె మతము ; మా గృహలక్ష్మీ !

పడకగది యలంకరణము పడతీ ! యానందకరము ; ప్రకృతీసతి దా
నడుగడుగున రమణీయతఁ జెడకుండెడు రీతిఁ గనుము ; శ్రీగృహలక్ష్మీ !

అచ్చుగ మెచ్చుగ నీవును ముచ్చటతోఁ బడకగదిని మురిపెంబలరన్
సచ్చిత్రతతిని దిద్దుము మెచ్చగ నీవిభుఁడు ; తెలియుమీ గృహలక్ష్మీ !

తలదువ్వుచుఁ బువ్వుముడిచియు కులకాంతరో ! బొట్టుపెట్టి కోమలవలువల్
తళతళఁ గట్టియు రతివలె వెలయుము నీ విభునిగూడ ప్రియగృహలక్ష్మీ !

భోగము ప్రాణుల నైజము; భోగంబే లేకనున్న భువి ప్రాణితతుల్
రోగంబు లొంది చచ్చును ; భోగవతీ ! సుఖములందుమో గృహలక్ష్మీ !

ఆనందము స్వర్గము ; తల్లీ ! నిత్యానందసౌఖ్య లీలలతోడన్
నానాభోగము; లందుము నీనాథునికూడి యాడి నిజగృహలక్ష్మీ !

నాథుఁడె దైవము తల్లీ ! నాథుఁడె నీ మన్మథుండు ; నవమోహనుడున్
నాథుఁడె ; యాతనివీడ ననాథవగుదు విద్ది దెలియునా ? గృహలక్ష్మీ !

పాతివ్రత్యము దలపుము నాతులకిది భూషణమ్ము ; నయగుణశీలా !
పాతివ్రత్యము విడిచిన పాతకముల జెందెదీవు ; వరగృహలక్ష్మీ !

అమ్మా ! ప్రకృతిస్వరూపిణి ! కొమ్మా ! నీశాంతిదాంతి కోమలగుణముల్
ఇమ్మహి మానవకల్యాణమ్మునకే పట్టుగొమ్మ నయగృహలక్ష్మీ !

# బాలప్రహ్లాద

శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు

2 వ రంగము

(హిరణ్యకశిపుడు సింహాసనాసీనుడై ఉండగా చండామార్కులు ప్రహ్లాదుడు ప్రవేశిస్తారు.)

ప్ర:- తండ్రీ నమస్కారము (వంగి నమస్కరిస్తాడు)

హి:- దీర్ఘాయురస్తు. కుమారా! యిటు రమ్మ (అని దగ్గరకు తీసుకొని తల నిమురుచూ చండామార్కులను చూచి) ఆచార్యా ఆ ఆసనముపై కూర్చుండుము. (కూర్చున్న పిమ్మట)

హి:- ఆచార్యా, ఏమి విశేషము? శిష్యసహితంగా వచ్చారు.

చం: ప్రహ్లాద కుమారుని విద్యాప్రావీణ్యత ప్రభువు వారిసన్నిధి నొకమారు ప్రదర్శింప జేయవలయు నని అభిలాష.

హి:- ఓహో! అదా విశేషం, చక్కగా చదువు కుంటున్నాడా?

చం:- చాల బాగుగా చదువుకొనుచున్నాడు,

హి:- పాఠాలు చురుకుగా వస్తున్నవా?

చం:- అతి శీఘ్రముగా వచ్చుచున్నవి. కుమార ప్రభువు అఖండ ప్రతిభాశాలి. ఒకమారుచెప్పిన పాఠములు మరల చెప్పనక్కరలేదు.

హి:- గ్రహణశక్తీ, జ్ఞాపకశక్తీ చక్కగా ఉన్న దంటారు?

చం:- సందేహమేమి? ఇంతటి మేధావియైన బాలుడు దానవకులమున నభూతో నభవిష్యతి. ఒక్కమారు చెప్పిన మాత్రముననే సమస్త శాస్త్రములూ మంచినీళ్ల ప్రాయమైపోవుచున్నవి.

హి:- (మహా సంతోషంతో మురుస్తూ ప్రహ్లాదుని అక్కున జేర్చుకొని ముద్దాడుచూ) కొమారా! సమస్త శాస్త్రాలు అంత సులభంగా నేర్చు కుంటున్నావా? అయితే మనం ముఖ్యంగా తెలుసుకోవలసిందేమో చెప్పూ?

ప్ర:- భగవన్మహిమ.

హి:- (తెల్లబోయి ఆలింగనం చేసుకుంటున్న ప్రహ్లాదుని నెమ్మదిగ వదిలిపెట్టుతూ) మనం ఏమి నేర్చుకోవాలె?

ప్ర:- భగవత్సేవ.

హి:- (మతికొంత కోపంతో కొమారుణ్ణి తోస్తూ) మనం దేనిని నమ్ముకోవలె?

ప్ర:- భగవంతుని అనుగ్రహమును.

హి:- (మహా కోపంతో కొమారుణ్ణి అవలకు త్రోసి మళ్లీ దగ్గరకు లాక్కొని కోపంతగ్గిన గొంతుతో ప్రేమను చూపిస్తూ) కొమరా! ఇవేమి పిచ్చి మాటలు. మనం తెలిసికోవలసింది రణతంత్రం, రాజతంత్రం; మనం నేర్చుకోవలసింది శత్రు నిర్మూలనోపాయాలు. మనం నమ్ముకోవలసింది భుజబలం. మనం ప్రభువులం, త్రిలోకాధి పతులం. ఈ త్రిజగద్రక్షణ భారమంతా మన భుజస్కంధంపై ఆధారపడిఉన్నది. వేల్పుల నెత్తిపైమొట్టి వారిచే వెట్టిచాకిరిచేయించుకొనే జగజెట్టులం. వారుబానిసలు; మనంప్రభువులం. ఆ గర్భశత్రువైన వైకుంఠుడితో హోరాహోరి పోరాడవలసిన మన మెక్కడ? ఆ దౌర్భాగ్య దామోదరుని స్మరించు టెక్కడ? ప్రహ్లాదా!

ఆ నారాయణ నామస్మరణ మనకు కులోచితం గాదు, వీరోచితం గాదు, రాజోచితంగాదు. ఆ పాపాత్ముని పేరు తలపెట్టకుండా ఆచార్యుల వారివద్ద నీవు నేర్చుకొనిన సర్వశాస్త్రాలసారము ఒక్క ముక్కతో చెప్పి నన్ను సంతోషపెట్టు నాయనా? ఏదీ ఒక్క శాస్త్ర వాక్యం.

ప్ర:- తండ్రీ!

"శోధింపంబడె సర్వశాస్త్రములు
రక్షోనాథ; వేయేటికిన్
గాథల్; మాధవ శేముషీ తరణి
సాంగత్యంబునన్ గాక దు
ర్మేధన్ దాటగవచ్చునే సుతవధూ
మీనోగ్రవాంఛా మద
క్రోధోల్లోల విశాలసంసృతి మహా
ఘోరామితాంభోనిధిన్."

హి:- మరల యిదేమి దుర్బుద్ధిరా మూఢా! ఆచార్యా! నాబిడ్డకు మీరు నేర్పిన పాఠములివేనా?

చం:- (భయంతో గడగడవడకి చేతులునలుపుకుంటూ) శివ! శివ! మే మిటువంటి పాఠములు చెప్పడుమా ప్రభూ! త్రివర్గ పాఠములన్నియు నూరిపోసితిమి. అన్నియు ఎంత చక్కగనో వల్లించెను. ఎంత విపులముగనో అర్థతాత్పర్యాదులు నేర్చెను. అవి అన్నియు తమకు వినిపింప జేయవలయునని తమ సన్నిధికి తోడ్కొని వచ్చితిని. తమ సమక్షమున వానిని వివరించుట మాని యిట్లు వదరుచున్నాడు. ఇది మేము నేర్పిన విద్యగాదు, సహజముగా పుట్టిన బుద్ధి.

హి:- ఆచార్యులు చెప్పని విషయములు నీకెట్లు వచ్చెనవిరా?

ప్ర:- దైవికముగ.

హి:- ప్రహ్లాదా! కసివాడవని దయతలచిన కొలది నీ చిత్తం వచ్చినట్లు ప్రేలుతున్నావు. ఇకదయచూడనుసుమా. నానాహింసలపాలు చేస్తానుసుమా.

ప్ర:- అనుభవకాలం వచ్చినప్పుడు తప్పించుకొనగలమా తండ్రీ.




హి:- అయితే చావుకు సిద్ధంగా ఉన్నావన్నమాట.

ప్ర:- భగవదిచ్ఛ ఎట్లున్న అట్లుజరుగగలదు. మృత్యువును తప్పించుకొనే వారెవ్వరు? పుట్టిన వారెల్ల గిట్టవలసినదేగదా.

హి:- (మహా కోపంతో పండ్లు పటపట కొరుకుచూ) ఆచార్యా! ఊరుకున్నకొలది వీని వాచాలత్వం మేరమీరిపోతున్నది. ఇక వీనిని ఉపేక్షించడం మా దైత్య వంశ వినాశనాన్ని అపేక్షించడమే. కనుక వీనిని రేపే వధించు ఏర్పాట్లు చేస్తాను పొండి. (ప్రహ్లాదు వెన్నుపై చేయిపెట్టి నెట్టుతూ) దౌర్భాగ్యుడా! కడుపు చెఱుప బుట్టావు; వినాశకాలే విపరీత బుద్ధిః- పో; నీకు మృత్యువు దాపురించినది.

ప్ర:-

శరణం భవ కరుణామయి కురు దీనదయాళో!
కరుణారస వరుణాలయ కరిరాజ కృపాళో॥

(అని భగవత్సంకీర్తన చేస్తూ వెళ్తాడు.)

చం:- (భయంతో వణుకుతూ) మహాప్రభూ! పిల్లవాడు కసికందు. తెలిసియు తెలియని ప్రాయము. దారుణ శిక్షల పాలుచేయుట ప్రమాదమేమో!

హి:- ఇటువంటి శాత్రవ పక్షపాతి నాయింట పెరిగి పెద్దవాడు కావడంకంటె మించిన ప్రమాదం లేదు పొండు. (227 వ-పుట చూడుడు)

# సైరంధ్రి

శ్రీమతి గంటి కృష్ణవేణమ్మగారు

(1948 డిసెంబరు నెల సంచిక తరువాయి)

అందరు చూడఁగా నచట నావిధి నన్ను బతివ్రతాగుణా
స్పందితవర్తనన్ బరమసాధ్విని గొల్వున కీడ్చి తెచ్చిన
ద్వందితులౌ విభుల్ గనఁగ వల్వల నూడ్చెను దుస్ససేను; డం
దుండియుఁ బల్కఁడాయెఁగద నంధుఁడు పుత్రకు నొక్క మాటయున్

తులువలు వలువలు దివియఁగఁ
బలుకరు కురువృద్ధు లోకరు; పలుక రితరులున్;
దలలెత్తరైరి పతులును;
గలుగునె యంతటి పరీక్ష కాంతల కెందున్?

అప్పుడు, గోవిందస్మృతి
దప్ప నొరులఁ దలఁచు బుద్ధి దార్కొన దయ్యెన్;
అప్పరమేశుఁడె విడిచిన
ముప్పొదవక యున్నె నాకు మూర్ఖులవల్లన్.

ఓకమలాక్ష! యోవరద! యోకరుణానిధి! గావు మంచు నే
నాకురురాజు నిండు సభ నశ్రుకణంబులు రాల వేడు నా
యాకులపాటు చిత్రముల యాకృతి జూచిరి గాని యొక్కరున్
నా కులపాంసనున్ దగ దటంచు వచింపరు చిత్ర మెట్టిదో?

శంతనుసుతు మహా శాంతవృత్తిని జేసి
వైచిత్ర్యవీర్యు లోభంబు వలన
దుర్యోధనుని దొడ్డ దురభిమానము పేర్మి
నతని సోదరు దుర్గ్రహమ్ము చేత
రాధేయు భుజపరాక్రమ విక్రమము జూచి
శకుని దుర్మంత్రంబు సాయమునను
గురుఁడు తటస్థుఁడై గూర్చుండు కతమున
గాంధారి మానంబు కారణమున

ధర్మశాలం ద్రోహ సేతువుడై దనరు కలన
    ఇంతకును మూల మత ద్వేష నింత పుట్టె;
గాక యుండిన నీపాట్లు గలుగఁ గలవె?
    కుడిచి కూర్చుండి తెచ్చె నీ బెడిదమెల్ల!

వలపులఁ గ్రుమ్మరించు పరువమ్ము వెలారెడు పూలతోటలో
గోలకున నున్న చెందొవలకున్ గిలిగింతలు పెట్టి గోర్కెన
య్యాలలకు వెండిపూఁత తెలుఁగా తెలిరంగు మెఱుంగు పెట్టి చెం
గలువల నేస్తకాని చెలికాంతులు దిక్కులఁ బర్వె నంతటన్.

సకల చరాచరమ్ములు ప్రశాంతమునన్ నిదురింప రేప్పవా
ల్పక లలితాంగి యెంతయును బాధపడెన్ మదియీ దురంత చిం
తకుఁ గల హేతు వేమిటొ; మనంబున నాటిన యీవ్యథా భరం
బకట యెఱుంగరాదు లవమైనను యిన్ని దినంబు లేరికిన్.

చెక్కిటఁ జెయిఁజేర్చి చెదరని దృష్టిచే మిన్నుగాంచె నింతేమి గనెనో యందుఁ;
దనలోనఁ దానె తాఁ దవిలి సంభాషించె నంత నిగూఢ రహస్య మేదో;
వేడినిట్టూర్పుల వేమారు వెడలించె హృదయమం దేయగ్ని రగులుకొనెనొ;
బొమముడి వైచుచుఁ బొరిఁబొరి తలయూచు నేకార్య నిశ్చయం బెంచుకొనెనొ;

బయలు పరికించె దానేమి భయము గనెనొ?
మౌనము వహించె నేమని మదిఁ దలఁచెనో?
వెగటు నవ్వులు పెదవుల విరియు టేమొ?
భీకరాకృతియై కొమ్మ పొదలు టేమొ?

కనుల నీరు గాదు గార్చిన దాయింతి
హృదయ నిర్గతాసృగుదిత ధార;
చూడలేదు మిన్ను సుదతి యీవిశ్వంబు
నెల్లఁ జూచె నొకట నుల్లమందు.

కృతయుగము నుండి నేటికి వెతకిఁజూడ
రక్తపాతంబు లేక యేరాజవరులు

పూజ్యసామ్రాజ్య భాగ్యంబు పొందఁ గలిగి;
రిదియు బిచ్చమా తిరిసి దోయిలి ఘటింప !

అమ్మనుజేశ్వరాధము లహంకృతితోఁ గనుచో సభాస్థలిన్
గ్రొమ్ముడి వట్టి యీడ్చె ననుఁ గూళ యొకం; డల దుస్ససేను తీ
వ్రమ్ముగ నేలఁగూల్చి నఖరమ్ముల రొమ్మును జీల్చి వేడిర
క్తమ్మును ద్రావఁడేనియు గదాయుధి యాతఁడు వాయుసూనుడే !

సతినిఁ బతివ్రతామణిని సన్న మొనర్చుచు నంకపీఠమున్
మతిసెడి సూపె నేదురభిమాని దురాత్ముఁడు వాని యూరువుల్
క్షితిని గదాహతిన్ బడఁగఁ జేయఁడ యేని సహస్ర కుంజరో
ద్ధత బలుఁడైన భీముఁడు గదన్ గొని మోయుట సిగ్గు చేటుగా !

కొమ్మ వేరొక్కపతినిఁ జేకొమ్మటంచుఁ
దూలనాడిన యాగండతులువ శిరముఁ
దాల ఫలమట్టు గూల్పంగఁ జాలఁడేని
కాల్పనే పార్థు గాండీవ బలము, చలము !

అగ్ని దరికొన్న యింట గోడయున మిగులుఁ;
జల్లఁగా నది పొంగిన నెల్లఁ బోవు
చందమున సుంత యలిగిన శమన సుతుఁడు
సమయరే ధార్తరాష్ట్రు లీక్షణము లోన.

మాకుఁ గాలము గాదంచు మాధవుండు
నూరకున్నాఁడు దానివ్వ డొరుని యట్ల;
యెల్లి యిక్కురు సామ్రాజ్యమెల్ల ధర్మ
సుతున కర్పింపడే వారు సూచుచుండ.

క్షత్రియ ధర్మము క్షాత్రము
క్షాత్రంబున రాజకులుఁడు శత్రుల సమర
క్షేత్రంబున గావుతి యిడి
ధాత్రిం బాలించు టొప్పు ధర్మయుతముగన్.

రాజసూయావభృథ పవిత్ర తరమైన
ఘానెరులఁ బట్టి కొలఁ ల్వాలో నీడ్చినట్టి
దుస్ససేనుని రక్తాన దోఁచి కాక
వీని ముడుచునే పాండవ వీరపత్ని !

శౌర్యము గల్గు వారయిన క్షత్రియ వంశజ వర్యులైన దో
ర్వీర్య మకుంఠితంబయిన వీర కులాగ్రణులైన, పాండవుల్
ఆర్య నుతంబుగాఁ గురుకులాధములన్ ధరగూల్చియున్ బరి
హార్యము రాజ్యభాగ మనిగైకొన కుందురె యింత యేటికిన్.

తెలతెల వారఁగఁ జొచ్చెను;
కలకల ఖగరవము సెలఁగె ఖర కరు రాకన్
దెలిపెడి వంది జనంబనఁ;
బొలతియు శుభశకునములను బొందుచునేగెన్.

శ్రీ శ్రీ శ్రీ

సమాప్తం.

*

శ్రీ నీహార గిరీంద్ర పుణ్యఫలమై సీమంతినీ రత్నమౌ
జ్ఞానాంబాయుతుఁడై నిజాశ్రితుల యజ్ఞానాంధ్యముం బాపి పూ
ర్ణానందంబునఁ గాళహస్తి పురి నశ్రాంతంబు గొల్వుండు నీ
శానుం డిష్టఫలప్రదాత యయి నిచ్చల్ మమ్ముఁ బాలించుతన్.

కవిస్తుతి

నన్నయ భట్టారకుఁ బోతన్ననుఁ దిక్కనను శంభుదాసుకవిఁ బె
ద్దన్నను నాంధ్ర కవీశుల నెన్నద గేల్మోడ్చి భక్తి నెవ్వాడు మదిలోన్.

అంకితము

అంబర చుంబితం బయిన యట్టి మహోన్నత సౌధమందు నే
సంబర మొప్ప నీ వెనుక ఛాయ క్రియన్ విహరించునట్టి నె
య్యంబునఁ గావ్యగోష్ఠిని నహర్నిశలున్ దృటిఁ బుచ్చునాడు ని
క్కంబిది యెంచు నాసరి జగంబున లేరని నిష్ఠవీగితిన్.

నాటి దినములు జనె రెప్పపాటు తోన
నిపుడు నిమిషాలె యుగములై యేగకుంట
నీవు నేర్పిన విద్యయే నీకు మరల
నొప్పఁ జెప్ప వ్రాసితిని గావ్యంబు నిట్లు.

సతి కేదుగడయుఁ బతియును
గతి నాకు గురుండ వీవ కరుణాంబుధి సం
స్మృతిఁ గొను పద్య కుశేశయ
మతిభక్తిఁ నీపదముల కర్పణ సేతుఁగా.

---

# స్త్రీలకు కొన్ని విషయములు

నీవు సర్వజీవులను ప్రేమింపుము. బీదవారని, అసూయజెందకు. నీవు నీ గృహములోనివారందరకూ తలలోనాలుకవై మెలగుము. నీఅత్తమామలను నీతల్లిదండ్రులవలె పూజింపుము. నీవు నిద్రలేవగానే నిత్యకృత్యములను నెరవేర్చుకొని, నీభర్తలేచేవరకు ఆయనకివ్వవలసినవి హాజరుచేయుము. నీభర్తనుదయము లేవగానే నీవు రేగినజుట్టుతో ఆయనకెదురుగా ప్రత్యక్షమవకు. ఎందుకంటే నీవేషంచూచిన ఆయనకు అసహ్యంజనించును.

అంతే ప్రొద్దున్నే దువ్వెన తీసుకొనమనికాదు నేనుచెప్పేది. రేగినజుట్టును నీచేతితో సవరించుకొని హిందుస్త్రీకి గృహలక్ష్మిఅను బిరుదువున్నదిగనుక గృహలక్ష్మికిముఖ్యము, ధనము, పూజ్యము అయిన కుంకుమ నొసటను ధరించుము. నీవెల్లప్పుడు పతికిప్రియురాలవై పతిప్రేమకుపాత్రురాలవుకమ్ము. వంటచేయుటలో నీచాకచక్యము నుపయోగింపుము. నీపతికి, అత్తమామలకు ఇష్టమైనపదార్థములేవో గ్రహించి వాటిని జాగ్రత్తగా వారిఅభిరుచికి తగినట్లు ఏర్పాటుచేయుము. ఇంటిలోనివారికి ఎదురాడవద్దు. వారిఅనుమతిప్రకారమే నడువుము. ప్రపంచములో అత్తకోడళ్ళ తగవుసహజమే. నీవు అటువంటివాటిలో జోక్యముకలుగజేసికొనకు. నీవు అతిసౌమ్యముతోను, మృదుత్వముతోను, మృదుభాషిణిగాను, వుండి అందరిప్రేమకు పాత్రురాలవుకమ్ము. ఇరుగు పొరుగువారితో కలసి మెలసివుండుము. పిల్లలవలన తరచు కలహములు వొస్తుంటవి. వాటినినీవు శాంతముతో, జాగ్రతగా పరిశీలింపుము. మనపిల్లలను మంచిప్రవర్తనతో మెలగునట్లుచూడాలి. కానివారు చాడీలుచెప్పగానే కయ్యమునకు కాలు త్రవ్వవద్దు. బీదవారినిచూచి అసహ్యించుకొననూవద్దు, ధనవంతులనుచూచి హెచ్చుగౌరవించనూవద్దు. అందరూ సమానమే. అందరి ఆత్మ ఒక్కటే.

ఇక ఇంటిసామానుసర్దుటలో తగుజాగ్రత్తతీసికొనుము. ఇల్లుచూచి ఇంటిఇల్లాలునుచూడు-అనుసామెతను మరువకుము. ఇంటిలోసామానంతా ఖంగారుగా వుండనీయక ఏది ఎక్కడవుండాలోచూచి సర్దుకొనుము. ప్రతివస్తువునూ గుర్తువుంచుకొని వేరు వేరుగావుంచుము. ఎందుకంటే మనకు కావలసినదానిని తీసుకొనునప్పుడు అది కనుపించనిచో అంతా ఖంగారుచేసెదము. నీవు తీసుకొనినవస్తువును పనిపూర్తికాగానే యథాస్థానములో పెట్టుము. సర్వజీవసృష్టిమయుడగు సర్వేశ్వరుని భక్తివిశ్వాసములతో మనస్సునందు పూజింపుము. ఆతడే నీకన్ని శుభములు చేకూర్చును.

యస్. విజయభారతీదేవి.

---

# లాలి పాట

లాలి రఘువంశభూపాల వనచైత్రా!
లాలి పట్టాభిరామా! లలితగాత్రా! లాలి||

లాలి శ్రితభక్త జనపాలినుత పాత్రా!
లాలి రుచిరోజ్వల విశాలాబ్జనేత్రా! లాలి||

లాలి సీతాత్మాబ్జ లోకైక భృంగా!
నీల జీమూతసన్నిభ కోమలాంగా! లాలి||

లాలి దీనావనా లీలాంతరంగా!
ఫాలాక్ష భీమకుంభః ధనుర్భంగా! లాలి||

జలరాశి గంభీర! శత్రుసంహారా!
కులశైల సమధీర! కుజన ప్రహారా! లాలి||

జలజాస్త్రసుకుమార! సజ్జనాధారా!
సలలితగుణోదార! సాధుమందారా! లాలి||

జనక వాక్పరిపాల! సౌజన్యశీలా!
జన కాత్మజాలోల! జనపాలపాలా! లాలి||

ఘనయశోనువిశాల! కరుణాలవాలా!
అనఘసద్గుణజాల! అమరపరిపాలా! లాలి||

లాలి కేళిత చక్రవాళ సత్కీర్తి!
లాలి పాలితభక్తజాలవిస్ఫూర్తి! లాలి||

లాలి జగదాంబనుత లలిత సన్మూర్తి!
లాలి జగదేకపాలక చక్రవర్తి! లాలి||

చింతలపూడి జగదాంబ.

### శ్రీ సంగీత రత్నాకర, సంగీత కళానిధి

# ద్వారం వెంకటస్వామినాయుడుగారికిసన్మానము

### రచిత పేటిక* రు. 35,000 ల రొఖ్ఖము

శ్రీ ద్వారం వెంకటస్వామినాయుడుగారు ఆంధ్రమాత పుత్రరత్నములలో నొక్కరు. వీరిపూర్వులు సేనానాయకులు; వీరున్నూ బెంగుళూరులో సైనిక శిబిరములలో 1893 లో జన్మించారు. సైనికులైనా వీరితండ్రితాతలు వాయులీనవాదనానిపుణులు; వీరి కదిమాతృతము సంక్రమించినది. వీరిఅన్న కృష్ణయ్యగారు తుమురాడ సంగమేశ్వరశాస్త్రిగారి శిష్యులు. వారే వీరిని గానకళయందు దిద్దితీర్చినది. ఆఅన్నగారి చలవనే వీణశేషణ్ణగారి ఆశీర్వచనమున్నూ పొందినారు.

1919 లో వీరిఘనతవిని శ్రీ విజయనగరం మహారాజావారు తామప్పుడే ప్రారంభించిన సంగీతకళాశాలలో వాయులీనాచార్యులుగా నియమించారు. నాటిప్రధానాచార్యులు శ్రీ నారాయణదాసుగారు విరమించుకున్నపిదప వీరే ఆకళాశాలకు ప్రధానాచార్యులు.

ప్రప్రథమంలో వీరికి బంగరుపతకమిచ్చి గౌరవించినది జయపురం మహారాజావారు, శ్రీ రాజా విక్రమదేవవర్మగారు. 1944 లో శ్రీ విజయనగరం మహారాజావారు "గాంధర్వ విద్యాభూషణ" అనే బిరుదు ప్రసాదించారు. 1931లో విశాఖపట్నపు పౌరులు శ్రీ డాక్టరు రాధాకృష్ణన్ గారి అధ్యక్షతక్రింద సమావేశమై రు. 800/-ల ఫీడేలున్నూ, రు.500/-ల అంగుళీయకమున్నూ అర్పించారు. పిదప వరుసగా 1933-35 లలో శ్రీ కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తి నాయుడుగారున్నూ శ్రీ జయపురం మహారాజులుంగారున్నూ బంగారపు తోడాలు చేతులకు వేశారు.



1927 లో మద్రాసు కాంగ్రెసుతోపాటు జరిగిన సంగీతక మహాసభలో వీరి కళానైపుణ్యత దాక్షిణాత్యులను దిగ్భ్రమచెందించినది ప్రభృతి-వారి మన్నన లందుచున్నారు. తిరువాన్కూరు మైసూరు సంస్థానాలలో గొప్పగా మెప్పుబడసినారు. 1929 లో అన్నామలై విశ్వవిద్యాలయమునగొప్పవేతనముపై సంగీత కళాధ్యాపకులుగా రమ్మనగా, ఇంట్లో చిక్కులవల్ల, శ్రీ విజయనగర ప్రభువులయందుగల భక్తి విశ్వాసమువల్ల రాజాలమనిరి. వారు వాయులీన జంత్రముపై కర్నాటక సంగీతమేగాక హిందూస్థానీ, పాశ్చాత్య బాణీలనుగూడ సాధనమొనర్చి సిద్ధిపొందినారు.

ఇట్టి మహనీయులను, ఆంధ్రమహాశయులు,-అపూర్వవిధిగా-చెన్నపురిలో సన్మానము గావించిరి. మద్రాసు కౌన్సిలు అధ్యక్షులు శ్రీ రాజా బి. రామకృష్ణరాజులుంగారిందు కార్యదక్షులైరి. శ్రీ ప్రధాన న్యాయమూర్తి రాజమన్నారుగా రధ్యక్షులైనిల్చిరి. శ్రీ శ్రీ శ్రీ భావనగర్ మహారాజా వారాసన్మానసభ కధ్యక్షతవహించిరి. ప్రథమమునుండియు విజయనగరం ప్రభువులుగదా వారి పోషకులు. శ్రీ శ్రీ శ్రీ విజయనగరం మహారాణీ సాహెబా విద్యావతీదేవిగారి సమక్షమున వారిశుభాశీర్వచనములతోనే ఈకార్యకలాపమంతయు జరిగిపోయినది. సుమారొక 2,000 రూ|| లు చేయు రజితపేటికను, రు.35,000/- రొఖమును-ఈ కళావేత్తకర్పించి కృతకృత్యులైరి.

ఆదర్శప్రాయమగు ఉత్తమోత్తమ జీవులలో నొక్కడగుట-ఆంధ్రగృహలక్ష్ముల కిట్టి పుత్రరత్నములను పెక్కండ్రగని ఆంధ్రదేశమున కీర్తివడయుదని హెచ్చరికగా మామూలు ఆచారమునతిక్రమించి ఈపురుషపుంగవుని జీవితవృత్తాంతము ప్రచురించితిమి. శ్రీ నాయుడుగారు చిరంజీవులైఇంకను కీర్తిసన్మానముల బడయుదురుగాక.



# రీటా తల వెండ్రుకలను పెంచును

రీటా కురుళ్ళకు బలమునిచ్చి నిగనిగలాడు నిడుపాటి వెండ్రుకలను పెంచుటకు అద్భుతమైన హెయిర్ టానిక్. తలవెండ్రుకలు రాలుట, నెరయుట, చుండ్రు, బట్టతల, పేనుకొరుకు ఇంకను తలవెండ్రుకలకు సంబంధించిన సమస్తవ్యాధులకు రీటా అమోఘముగ పనిచేయును. వేనకువేలు వాడి గుణమును పొందియున్నారు. మీరుకూడా నేటినుండియే రీటా వాడుడు.

## హిందీ, ఆంధ్ర, తమిళ, కన్నడ తారల ప్రశంసలు

**లలితాపవర్ :** ఉత్తమమైన హెయిర్ టానిక్ కోరేవారికి రీటాకు మించినది మరేదీలేదు. దానిని వాడితే వారు మనమాతృభూమి అనేక శ్రేష్ఠమైన వస్తువులను ఉత్పత్తి చేయగలదని గ్రహించుకోగలుగుతారు.

**సుశీల్ కుమార్ :** రీటా శిరోజాల వృద్ధికి మిక్కిలి సంతృప్తికరమైన సాధనం. శిరోజాలు రాలిపోతున్నపుడు నివారణకు, బుద్ధినైర్మల్యానికి ఎల్లరూ ఎప్పుడూ రీటానే వాడాలని సిఫారసు చేస్తున్నాను.

**కన్నాంబ :** రీటా నాకు పరిపూర్ణమైన తృప్తికలిగించినదని తెలుపుటకు మిక్కిలి సంతోషముగానున్నది. అది నిజముగా అమోఘమైనది.

**పుష్పవల్లి :** నాకు సుమారు ఏడాదిగా తల వెంట్రుకలు రాలిపోతున్నవి. రీటా వాడినప్పటినుండియు, తలవెంట్రుకలు రాలుట తగ్గింది. ఇది చాల శ్రేష్టమైన హెయిర్ టానిక్ అని నా అభిప్రాయము.

**సూర్యకుమారి:** రీటా మంచి సువాసనకలిగి, వాడినవారికి ఎంతో చల్లదనము చేకూర్చును. ఇకమీదట ఎల్లప్పుడు రీటానే వాడవలయునని నేను ఒక నిశ్చయమునకు వచ్చితిని.

**కృష్ణవేణి:** రీటా చక్కని సువాసనగలిగి, మనస్సునకు ఆహ్లాదాన్ని కలిగిస్తుంది. తల వెంట్రుకలను రాలకుండాచేసి, కొత్త వెంట్రుకలను పెంచుటకు రీటా సాటిలేని హెయిర్ టానిక్.

**ఆర్. పద్మ:** నా ముఖసౌందర్యమును పెంపొందించే శిరోజాలకు రీటాయే కారణము. స్వల్పకాలములోనే రీటా అద్భుతముగ గుణము నిచ్చినది.

**లక్ష్మీబాయి:** తలవెండ్రుకలను పెంచుటకు రీటా అమోఘముగ పనిచేసినది.

**వసుంధరాదేవి:** శిరోజాలు దీర్ఘంగా నిగనిగలాడుతూ ఎదగడానికి, శిరోజరక్షణకు రీటా అమోఘమైనదిగ రుజువైనది.

**రాజమ్మ :** శిరోజ సంబంధమైన బాధల నివారణకు రీటా అమోఘమైనది. గుర్తించుకున్నాను. శిరోజవృద్ధికి, రక్షణకు ముఖ్యమైన వస్తువులు రీటాలోవున్నవి. దీర్ఘవినీలకుంతలాలు ఆశించే మహిళలందరూ దీనినే వాడాలి.

# రీటా హెయిర్ టానిక్

# నా చిన్ననాటి ముచ్చట్లు

డా॥ కే. ఎన్. కేసరి

## మద్రాసులో కట్టడములు

నేడు మద్రాసులో గొప్ప కట్టడములై రాణించుచున్నవి చాలవరకు, నేను ఈ ఊరికి వచ్చిన తర్వాత నే చూచుచుండగా కట్టబడినవే. కావున ఆయా వాని కట్టడపు చరిత్రలు కొన్ని నాకు తెలియును.

## హైకోర్టు భవనము

నేను కొన్ని దినములు పచ్చయప్ప కాలేజీకి సంబంధించిన గోవిందప్ప నాయకరు హైస్కూలునందు చదువుచుంటిని. నేను అక్కడ చదువుచుండిన కాలముననే ఇప్పటి క్రొత్త హైకోర్టు భవనమును కట్టుచుండిరి. ఈ కట్టడమును తాటికొండ నంబెరుమాళ్ల శెట్టిగారు కంట్రాక్టుకు తీసుకొని కట్టుచుండిరి. ఆ కట్టడమునకు విశేషముగ మలిచిన నల్ల రాళ్లను ఉపయోగించుచుండిరి. ఆ రాళ్లను సులభముగ పైకితీసుకొని పోవుటకు కొన్ని యంత్రములను (Lifts) వాడుచుండిరి. ఆ యంత్రములను చూచుటకు స్కూలునుండి కొందరు పిల్లకాయలు అక్కడికి పోవుచుండిరి. నేనును బడికిపోవుటకు ఇష్టములేనినాడు, పాఠములను చదువనినాడు కానీ బటానీలనుకొని జేబులోపోసుకొని కట్టుచుండు కట్టడము వద్దకుపోయి కాలమును గడుపుచుంటిని. గనుక ఈ కొత్త హైకోర్టు నాతనిఖీ మీదనే (Supervision) కట్టబడినదని చెప్పవచ్చును. పాత హైకోర్టు యిప్పటి కలెక్టరు ఆఫీసు నందుండెను.

## వై. యం. సి. ఏ. భవనము

ఇప్పుడు Esplanade లోయున్న క్రొత్త Y. M. C. A. భవనముకూడ నా కళ్ల యెదుట కట్టబడినదే. ఈభవనమును కట్టకముందు ఈసంస్థ హైకోర్టు యెదుట ఒక చిన్న మేడలోఉండినది. అక్కడ బుక్కుకీపింగ్, టైప్ రైటింగ్ షార్ట్‌హాండు (Book-keeping,-Typewriting, Short hand) మొదలగు విద్యలను నేర్పించుచుండిరి. నేను కూడ ఆ క్లాసులోచేరి షార్టుహాండు టైప్‌రైటింగులను (Shorthand & Typewriting) విద్యలను నేర్చుకొనుచు ఆ సంస్థకు సభ్యుడనైతిని. పిమ్మట క్రొత్తగ కట్టిన భవనమునకు సంస్థ చేరగనే నేనుకూడ అక్కడచేరి శాండోయక్సరసైజు (Sandow exercises) మొదలగు (Indoorgames) వ్యాయామములను నేర్చుకొనుచుంటిని. ఈ Y. M. C. A. తో అప్పటినుండి యిప్పటివరకు నాకు సంబంధము గలదు. ఇప్పుడు నేను నివసించు కేసరి కుటీరము భవనమునకు ప్రక్కనయున్న రాయపేట బ్రాంచి Y. M. C. A. లో నేను సభ్యుడుగనున్నాను. అక్కడ జరుగు ఆటపాటలలో నేను పాల్గొనుచుందును. ఇంటి ప్రక్కననే యున్నందున ఆ విశాలమైన మైదానములో అచార పచార చేయుచుందును.

ఇప్పుడు సెంట్రల్ స్టేషనుకుప్రక్కన కట్టియున్న (M. S. M.) మదరాస్ అందు సదర్న్ మహారాష్ట్రరైల్వే ఆడిట్‌ఆఫీసుకట్టడము ఇతర కట్టడములు కట్టినదికూడ నాకు తెలుసును. ఈప్రదేశమున ముందు పార్కు (తోట) యుండినది. ఈ కారణము వల్లనే ఈ ప్రాంతమునకు పార్కు టవున్ (Park Town) అని పేరు వచ్చినది. ఈ కట్టడము ప్రక్కననే పార్కుటవున్ పోస్టాఫీసు కట్టడము కలదు. ఈ రైల్వే ఆడిట్ ఆఫీసుకూడ తాటికొండ నంబెరుమాళ్ల శెట్టిగారే కంట్రాక్టుకు తీసుకొని కట్టించిరి. సెంట్రల్ స్టేషన్ ఆరంభమున కట్టినది నాకు తెలియక పోయినను పిమ్మట క్రమముగ దానికి చేర్చికట్టిన ప్లాటుఫారములు వగైరాలు నాకు దెలియును. ముందు పాతస్టేషన్ రాయపురమున నుండినది.

ఇప్పటి మద్రాసు కార్పొరేషన్ భవనమును కట్టుచుండినప్పుడు నేను సుగుణ విలాస సభ మెంబరుగనుండి దానిని కట్టిన విధమును చూచుచుంటిని. అప్పుడు సుగుణ విలాస సభ దాని ప్రక్కనయుండు విక్టోరియా పబ్లిక్‌హాలు (V. P. Hall) నందుండెను. పాతమునిసిపలు ఆఫీసు జార్జిటవున్ యర్రబాలుశెట్టి వీధిలో యుండెను.

ఇప్పుడు బీచిలోయున్న క్రొత్తనేషనల్ బాంకి కట్టడ ముందు స్థళమున సింగ్లర్ స్కూలు (Singler School) ఉండెను. ఈ నేషనల్ బాంకిని, ఇప్పటి ఇంపీరియల్ బాంకిని (ముందు మద్రాసు బాంకి) కట్టినదికూడ నాకు తెలుసును. పాతనేషనల్ బాంకి ఆర్మీని యన్ స్ట్రీటులోను మద్రాసు బాంకి బ్రాడ్వేలోను వుండినవి. పోస్టు ఆఫీసుకు సంబంధించిన క్రొత్త కట్టడములన్నియు కట్టినది నాకు తెలుసును. పాత హార్బరునుమార్చి ఇప్పుడు కట్టిన నూతన హార్బరును కట్టినదియు నాకు తెలుసును. పాతహార్బరుమీద శనివారము ఆదివారము కొంతరముచేరి షికారుకు వెళ్లుచుంటిమి. దీనినేఅప్పుడు యినుప వారధి అని పిలుచుచుండిరి. మౌంటు రోడ్డులో యుండిన T. R. Tawker & Sons ను (ఇప్పుడు Sree Rama Buildings) స్పెన్సరు కంపెని కట్టడముకు కట్టినది నాకు తెలియును. పాత యస్. ఐ. ఆర్. స్టేషను (S. I. R. Station) ను మార్చి ఇప్పటి కట్టడమును కట్టినది, బీచి స్టేషను కట్టినది, మూరు మార్కెట్టును కట్టినది నాకు తెలియును. మద్రాసులో ముందుండిన పాతమార్కెట్టు ఇప్పుడు శ్రీరాముల పార్కు అను స్థళమున బ్రాడ్వేలోనుండెను. ఇప్పటి లాకాలేజి నేను చూచుచుండగ కట్టినదే. ఈ లాకాలేజిని కట్టకముందు B. L. క్లాసులు హైకోర్టు భవనమునందే జరుగుచుండెను. ఆ క్లాసులు ఉదయము 10 గంటల లోపుగనే జరుగుచుండెను. అప్పుడా క్లాసుల ప్రొఫెసర్లు ప్రసిద్ధులగు రామచంద్రరావు సాహేబు, టి.వి. శేషగిరి అయ్యరు, మోరిశెట్టి వెంకట్రామ శెట్టిగారు, సుబ్రహ్మణ్యాయ్యరు మొదలగు వారుండిరి.

## జేబుదొంగలు — కత్తెరదొంగలు

మద్రాసు సెంట్రలుస్టేషను ప్రక్కనయుండు కూవముకాలువకు కట్టియుండిన వారధివద్ద ఒకడు నిలుచుకొని దోవను పోవువారినిపిలిచి "అదుగో చూడండి మనిషి కాలు వలో కొట్టుకొనిపోవుచున్నా"డని చెప్పును. అప్పుడు దోవనపోవువారందరు ఒకరివెంబడి ఒకరుఅక్కడ గుంపుచేరుదురు. "అదుగో తల; అదుగో కాలు" అని వాడుచెప్పును. అక్కడ నిలుచున్నవారందరు ఆదృశ్యమును చూచునప్పుడు జేబుదొంగ అక్కడ నిలుచుండిన వారి జేబులలోయున్న డబ్బుసంచులను, ఫౌంటెన్ పేనాలను సంగ్రహించి గుంపులో కనుబడకుండ కాలికి బుద్ధిచెప్పును. ఈలోపల యెవరైనను కనుక్కొని దొంగ అని కేకలువేయగ

ఈదొంగయే పరుగెత్తుచు దొంగను పట్టుకొనుడని కేకలువేయుచు పరుగున యేసందు లోనో మాయమగును. ఈలాటివి అనేకరకముల చోరీలు యిప్పుడూ జరుగుచునే యున్నవి.

మద్రాసు సెంట్రలుస్టేషనులోను పర్వదినములలోను దేవాలయమున చేరు గుంపులలోను కత్తెరదొంగలు బిడ్డల మెళ్లలోయుండు ఆభరణములను కత్తిరించుకొని పరారి చిత్తగించెదరు. ఇవి యిప్పుడును జరుగుచునేయున్నవి.

కొన్ని సంవత్సరములకు మునుపు జార్జిటవున్ గోవిందప్పనాయునివీధిలో పట్టపగలు కోమట్లయిండ్లలో దొంగలు జొరబడుటను ప్రారంభించిరి. గోవిందప్పనాయునివీధిలో యున్న ఇండ్లు ఒకదానికొకటి ఆనుకొనివుండుటవలన ఒకయింటి మిద్దెమీదనుండి వీధిననుండు మిద్దెలన్నిటిమీద సులభముగ నడవవచ్చును. ఇందువలన ఒకచోట దొంగ పక్కయింటికిపోవుచు ఇంటిలో వంటరిగనున్న స్త్రీలమెళ్లలోయుండిన నగలను కత్తిరించుకొని పోవుచుండిరి. అప్పటినుండి గోవిందప్పనాయునివీధిలోనేగాక యితరయిండ్లలోయుండు ముంగిళ్లకును ఇనుపట్టాలపందిళ్లను వేయవలసివచ్చెను. అప్పటినుండి మద్రాసులోకట్టు ప్రతియింటి ముంగిలికి ఇనుపపట్టాల బందోబస్తున్నది. ఇప్పుడు మద్రాసులో కిటికీకమ్ములను వూడబీకి దొంగలు యింట ప్రవేశించుచున్నారు. వాననీళ్ల గొట్టములనెక్కి యింట ప్రవేశించి దొంగతనములను చేయుచున్నారు. తలుపు తాళంవేసిన ఇండ్లలోదూరి దోచుకొని పోవుటకూడ విస్తారముగనున్నది. ఈ దోపిళ్లు రాత్రిళ్లేగాక పగలున్నూ జరుగుచున్నవి. ముఖ్యముగా 11-5 గం॥లకు మధ్య జరుగునట. ఇట్టివి జరుగకుండా నౌకర్లును కావలాయుంచుడనియు, కానిచో ప్రక్క ఇంటివారితో చెప్పి వెళ్లుడనియు పోలీసు అధికారులు ఉపాయము చెప్పుతున్నారు. ఆఫీసుల ఎదుట, కాఫీహోటళ్లముందు పెట్టియుండు సైకిళ్లనుకూడా హెచ్చుగా దొంగలించికొని పోవుచున్నారు. వీనికి తాళము వేసియుంచుడని మద్రాసు పోలీసువారి సలహా. పోలీసు బందోబస్తుకూడ వృద్ధి చేసినామని పోలీసువారు ప్రకటించారు.

———:0:———

# శాశ్వతమైన సౌందర్యమునకు...






మీ రెండు విధములైన సౌందర్యపు శిక్షణ:—

ప్రతి రాత్రి, పాండ్స్ కోల్డ్ క్రీముతో మీ ముఖమును కడుగుడు. ఈ క్రీమును మీ ముఖమునకు అంటించి మెల్లగా రుద్దుడు. చర్మ రంధ్రములలో జొచ్చి, మురికి సంకటిని బయటికి త్రోయును. తరువాత తుడిచివేయుడు. తళతళ మెరసే మీ ముఖ వర్చస్సును చూడుడు!

ప్రతి ఉదయము, పాండ్స్ వ్యానిషింగ్ క్రీమును మీ ముఖము మీద పలుచని పొరగా అంటించుడు. చర్మ రంధ్రములలో సులభముగా జొచ్చి, అదృశ్యమై, దినమంతయు సూర్య రశ్మి తగిలే మీ ముఖమును కాపాడును!

## పాండ్స్ రెండు క్రీములు

మీ ముఖవర్చస్సు అందముగా, మనోహరముగా నుండుటకు మీకు రెండు క్రీములు అవసరము, శుభ్రపరచుటకొకటి, కాపాడుటకు మరొకటి. రాత్రి, కంటికగుపడని మురికిని తీయుటకు సూక్ష్మమైన నూనెల కలయిక వలన తయారైన క్రీము అవసరము—పాండ్స్ కోల్డ్ క్రీము. ఉదయము, సూర్య రశ్మినుండి ముఖము వన్నె తారకుండ కాపాడుటకు మృదువైన చల్లని క్రీము—పాండ్స్ వ్యానిషింగ్ క్రీము.



# పాండ్స్

వ్యాపార వివరములకు: యల్. డి. సెమూర్ అండ్ కం., (ఇండియా) లి.
బొంబాయి, కలకత్తా, ఢిల్లీ, మద్రాసు, నవ గోర, కరాచి, కొలంబో, రంగూన్

# "ముదితల్ నేర్వగరాని విద్యగలదే ముద్దార నేర్పించినన్"

## విద్యయనగా జ్ఞానము; విద్యయొక్క ముఖ్యోద్దేశములేవి ?

సత్ప్రవర్తనకు, సదసద్వివేకమునకు, ఉత్తమనిర్ణయశక్తికి మూలశక్తి నేర్పరచుటయే విద్యయొక్క ప్రధానమైన ఆశయము. ఆతరువాత విద్యవల్ల ఊహాశక్తి పెంపొందవలయును; జీవితమంటే ఒక అభిమానమేర్పడవలెను; సౌందర్యమునందు, పుస్తకములందు, ప్రకృతియందు గాఢమైన ఆసక్తి కలుగవలయును. విద్యావంతురాలగుటయనగా చాకచక్యముతో బ్రతుకు పద్ధతి తెలుసుకొనుటే. అనగా దానివల్ల మూడు శక్తులు కలగవలె; బ్రతుకుతెరువు తెలియుటొకటి; ఉత్తమపౌరధర్మము తెలియుట రెండవది; విరామకాలము సద్వినియోగముచేయ తెలియుట.

కనుక విద్య ప్రతిమానవుడికీ జన్మహక్కు. అంటే ప్రతిస్త్రీకికూడా. ఇంగ్లండు, అమెరికా, రష్యా వంటి పారిశ్రామికాభివృద్ధిగల దేశాలలో ఈ హక్కు పూర్తిగా గుర్తింపబడినది. కాని మన ఇండియా లాంటి దేశాలలో విద్యాభివృద్ధి శోచనీయంగా ఉన్నది. మనదేశమందుగల 35 కోట్లప్రజలకు 2 కోట్ల పురుషులు, 40 లక్షల స్త్రీలకంటే విద్యాధికులు లేరు. దీనినిబట్టి మనదేశంలో విద్యగలవారిసంఖ్య ఎంత తక్కువగానున్నది మీరే గుర్తించగలరు. అందును స్త్రీవిద్య చాలా అధోగతియందున్నది. ఏదేశమైన వృద్ధిపొందవలెనన్న పురుషులు, స్త్రీలు యావన్మందీ విద్యగలవారై యుండాలి. విద్యనుపొందడంలో స్త్రీలందరు, పురుషులతోబాటు సమాన హక్కులు గలిగియుండాలి.

ప్రతిస్త్రీకి కొంత విద్యఅవసరమని ఏకొద్దిమందో తక్క, తక్కినవారంతా అంగీకరించినా, ఆ విద్య ఎలాంటిదై యుండాలి అన్నదాంట్లో చాల తీవ్రమైన భేదాభిప్రాయాలున్నవి. స్త్రీకి గృహమే రాజ్యమనియు గృహమునకుసంబంధించిన విషయాలతో దక్క, తదితర విషయాల్తో - అనగా రాజకీయాలతోగాని దేశాభివృద్ధికవసరమగు ఇతర ముఖ్యవిషయాలతోగాని-సంబంధములేదనియు చెప్పునట్టిపురుషులు చాలమంది గలరు. పురుషులేగాదు. లోకజ్ఞానశూన్యలగు స్త్రీలుగూడా. ఇదే స్త్రీయొక్క ఉన్నతవిద్యపతనానికి కారణము. ఇది దేశమునకన్నివిధముల తీరనినష్టము. స్త్రీలు చాలామంది ఉన్నతవిద్యబడసి వారిష్టమగు వృత్తులందుచేరుట, స్త్రీల అభ్యున్నతికి అభ్యుదయానికిగూడా మంచిదే.

స్త్రీ శక్తిస్వరూపిణి. ఆమెలోనుండే కార్యశూరత, సాహసం, చిత్తస్థైర్యం, త్యాగశీలత అధికతరమైనదని చెప్పుటకు ఏమాత్రము సంశయములేదు. కాని స్త్రీకి విద్యాసంస్కారము లేకపోవుటచే ఈ అపూర్వగుణములు విషమఫలితముల నిస్తున్నై.

స్త్రీ సాహసి... ఆమె తలపెట్టిన కార్యమును ఎప్పటికైనా, ఏవిధంగానైనా కొనసాగించుకోగలదు. ఝాన్సీ లక్ష్మీబాయివంటి స్త్రీలు పురుషవేషములతో యుద్ధమొనరించుట వారిధైర్యసాహసాలను చూపించుట లేదా ? యుద్ధమునవోడి తిరిగివచ్చిన ఖడ్గతిక్కనను తిరిగి యుద్ధభూమికిబోవునట్లును, వీరస్వర్గము నలంకరించునట్లును యొనరించిన వానిభార్యయొక్కయు, తల్లియొక్కయు శీలము వారి త్యాగమునకు మార్గదర్శకము గాదా! శివాజీని గొప్పవీరుడుగా తయారుజేసిన జిజియాబాయి స్త్రీలయొక్కశక్తి సామర్థ్యములను సూచించుటలేదా ?

స్త్రీయొక్క సహాయములేక ఏ శిథిలమైన రాజ్యమును చక్కబడదు. ఏ మతమును వ్యాప్తిగాదు. స్త్రీయనిన లోకజ్ఞానశూన్యమైన స్త్రీ గాదు. విద్యాధికురాలగు స్త్రీ. ఇట్టి స్త్రీలు దేశాభ్యుదయమునకు కారకులయ్యెదరు.

కోడాలి భవాని




ఫిబ్రవరి సంచిక తరువాయి

11 పడిశెము:-పసిపిల్లల శరీరతత్వములు అతి కోమలములైయుండును. ఆహారము, నిద్ర, విశ్రాంతి, వెలుతురు, స్నానము, మాతృపోషణ, ఉడుపులమార్పు, ఉల్లాసము, హాయినిచ్చు తల్లివడిలో ఆటలు అనువానివల్లనే సామాన్యముగ ఆరోగ్యము చెడకుండును. పడిశెముపట్టిన ఇవన్నియు మానవలసివచ్చును. అందులకే పడిశెము పదిరోగములపెట్టు అని వైద్యసామెతకలదు. దీనిని నిరోధించుకోకలిగిన శక్తియుకూడ కావలయును. అదిలోపించినపుడే పడిశెముపట్టును. దీర్ఘకాలముండిన పిల్లలను శుష్కింపజేయును. ఇందులకు ప్రతిగృహలక్ష్మి సులభముగ కస్తూరిమాత్రలు చేసికొని దగ్గరనుంచుకొనుట మంచిది. గృహవైద్యసులభప్రకరణము.

| | |
|---|---|
| మంచికస్తూరి | 2 గురిగింజలు |
| లవంగాలు (వేయించినవి) | ½ తులము |
| పిప్పళ్లు | ½ తు |
| శొంఠిచూర్ణము | ½ తు |

శొంఠి వేయించిన తర్వాతనే వేయవలయును.

| | |
|---|---|
| గోరోజనము | 2 గురిగింజలు |
| కటుకరోహిణి | ½ తు |
| ఇంగిలీకము | 2 గురిగింజలు |

నల్లతమలపాకు (కమ్మరాకు) రసముతోగాని తులసిఆకు రసముతోగాని కలియ నూరి మినపగింజప్రమాణము మాత్రలుచేసి వారమున కొకమాత్ర పిల్లలకును, మూడురోజుల కొక పర్యాయము పెద్దలును వాడుకొనవచ్చును.

12 కోరింతదగ్గు:- సర్వసామాన్యముగ పిల్లలకు వకతూరి మాత్రమే కానుపించును. ప్రత్యేకౌషధములు అనవసరము. అయిననూ కొందరు యీ దిగువనుదహరించిన సూక్ష్మవైద్యములు చేయుటవల్ల తీవ్రత తగ్గునని తెలుసుకొనియున్నారు.

ఒకవిధము:- మంచితేనె 1 స్పూను అడ్డసరముఆకును నిప్పులసెగపైనవుంచి రసము తీసి కల్పియివ్వవచ్చును.

మరియొకపద్ధతి:- అతిమధురముచూర్ణము, పొంగించిన వెలిగారమును మెత్తగా చూర్ణము గావించి కల్పి పూటకు 2 గురిగింజలప్రమాణమిచ్చిన మేలగును.

మూడవపద్ధతి:- ఖర్జూరపుకాయను మంచినీటిలో అరగదీసి ఆగంధమును నాలుకకు రాచినను గుణమిచ్చును. కోరింతదగ్గుచే బాధపడువారలనుచూచిన యిట్టివైద్యము లుపకరించునా యనితోచును. వాడినవారివల్ల తెల్సుకొని యిందు తెల్పుచున్నాము.

13 పాలబుగ్గలపైన చిరుగుళ్ళు:- తల్లిదండ్రులు పలుమారు యీ చిరుగుళ్ళు ఏవిధమున పోవునని అనుకొందురేగాని యేమియు చికిత్స సదుపాయములుచేయరు. సులభముగపోవును. పెరుగుమీది మీగడను వడియగట్టినదానిని చిరుగుళ్ళపై రాచిన నెమ్మదించును. లేదా జీలకర్రను మెత్తగానూరి చిరుగుళ్ళపైరాచినను పోవును.

# ఇంటిపనులలో మెళకువలు

## తల్లిప్రేమ, శిశుపోషణ

బిడ్డల పోషణ విషయము తల్లిదండ్రులు మిక్కిలి బాధ్యతతోను, ఎక్కువ ఓరిమిగానూ, సమాన దృష్టితోనూ, చూచిన, ఆ బిడ్డల ఆరోగ్య భాగ్యములకుగాని, ఆనందమునకుగాని అంతువుండదు. బిడ్డలను మనముచూచేనేర్పు, (అనగా) ఏబిడ్డను, ఏవిధముగాచూచిన, ఆ బిడ్డ తృప్తిపడునో ఆ విధము బాగుగా గమనించి, బిడ్డలకు ఏదిప్రీతో, బిడ్డలకు దేనియెడల ఆసక్తివున్నదో కనిపెట్టి వారివారి యిష్టాను సారముగా మనము బిడ్డలను తృప్తిపరచిన, మనయెడల, (అనగా) తల్లిదండ్రులయెడల ఆ బిడ్డలు భక్తిశ్రద్ధలు చూపుదురు. బిడ్డలకు వూహప్రాయము వచ్చువరకు, 8 సంవత్సరముల ప్రాయము వచ్చువరకు, ఎక్కువశ్రమ పడవలెను. తరువాత లోకజ్ఞానముకల్గి, ఏది తింటే జబ్బుచేస్తుందో, దేనివలన అపాయము కలుగునో, అనే విషయము ఆ చిన్న ప్రాణాలకు కొంతమట్టుకు తెలుస్తుంది. అంతవరకు తల్లే ఎక్కువ బాధ్యతతోచూచి బిడ్డలను జాగ్రత్తగా కాపాడవలెను. తరువాత బిడ్డలను పక్షపాతముగా ఏ తల్లిదండ్రులుకూడా చూడకూడదు. పుట్టిన బిడ్డలంతా ఒకేమాదిరిగా నుండరు. (అనగా) అందచందములలోగాని, తెలివితేటలలోకాని, అందరు అన్ని రకములుగా నుండవచ్చును. అది మన సుకృతమునుబట్టి వచ్చును. అందమైన వాళ్లను, తెలివిగలవాళ్లను, విశేషముగాచూచి, అనాకారులను తెలివితక్కువ వాళ్లను దృష్టిలో పెట్టుకోకుండా, వాళ్లు ఏమితింటున్నారో, ఏలా వుంటున్నారో అనే ధ్యాసలేకుండా వున్నయెడల వాళ్లు మరీ అందవికారముగాను, వట్టివెర్రివాళ్లుగాను తయారై ఎందుకు పనికిరానివాళ్లుగా తయారగుదురు. కాన తల్లిదండ్రులు యీ రెండోరకము వాళ్లపైనే ఎక్కువశ్రద్ధ పెట్టుకొని, మిక్కిలి నేర్పుగా వాళ్లను అన్ని విధముల మంచి ప్రాజ్ఞులుగా చేసుకోవచ్చును. అందమైన బిడ్డను, అభిమానముగల బిడ్డను, అన్ని రకముల తయారుచేసుకొనుచుండుటకుంటూ, ఏదో అనాకారిగానున్నదిగదాయని అమాయకత్వముగా నున్నదని, ఆ బిడ్డను ఏదో ఏలా వున్నాసరే అని చూచిన ఆ తల్లి దండ్రులను భగవంతుడు మెచ్చడు. సమానమైన కష్టనిష్టురములకోర్చికన్న ఆ తల్లి ముఖ్యముగా యీ విషయమును మనస్సున పెట్టుకొని, అందరిని సమానమైన ప్రేమతో చూడవలెను. ఒక్కొక్క తండ్రికూడా తనకు అభిమానముగల బిడ్డను ఆభరణములతో అలంకరించుకొని, గొప్పయింటి కోడలై ఎంతో గొప్పగా వుండాలని ఆశపడతాడు. కాని, అందరూ ఆ విధముగా నుండాలనే అపేక్ష పెట్టుకోడు. అబ్బాయిల విషయముకూడా తమకు ఏకొడుకు ఎడల ప్రేమవుండునో, వాళ్లకే పెద్ద చదువులు చెప్పించి, గొప్పవుద్యోగములు చేయించి, వాళ్లు సూట్లు, బూట్లు వేసుకు తిరుగుతుంటే, ఎంతో ఆనంద పడతారు. కొంచము బేలగాను, అమాయికత్వముగాను వున్న కొడుకునుచూచి వీడు చదివేదేమిటి? మనల నుద్ధరించేదేమిటని; వాని వైపు చూడనైనాచూడరు. ఆ పరిస్థితిలో ఆ అమాయికపు కొడుకు ఎందుకు పనికిరానివాడై, వాని జీవితమంతా అంధకారము చేసుకొని, వూరూరా తిరుగుతుంటే, ఆ అప్రతిష్ట ఆ తల్లి దండ్రులకు కాదా? కాబట్టి, బిడ్డలందరిని సమానమైన దృష్టితోను, న్యాయబుద్ధిగాను చూడవలెను. అటుపైని, వారివారి అదృష్ట, దురదృష్టములలో ఎవరును ఏమిచేయలేరు. మనలోప ముంచుకొనకూడదు.

ఇక బిడ్డల పోషణ విషయము, మన బిడ్డలకు ఏపదార్థముకూడా బజారునుండి తెచ్చిపెట్టకూడదు. అది చాలా అనారోగ్యముకల్గి, చాలాబాధపడవలసివచ్చును. మనకు చేతకానిది, మనము చేయలేనిది ఏమిలేదు. బద్ధకించకుండా, బుద్ధినివుపయోగిస్తే ఏపనినైనా చేయగలము. శరీరానికి శ్రమ అనుకోకుండా చేయగలిగితే, మనవల్ల కాని పనులుండవు. అదిగాక మనము చేసుకోవడములో ఏపదార్థమైనా శుచిగాను, రుచిగాను తయారు చేసుకోవచ్చును. వంటకములను, మన చేతులమీదుగా తయారుచేసుకొని, మన బిడ్డలకు,

మన యింటివారికి (అనగా) యజమానులకు, తృప్తిగా పెట్టుకున్న ఆరోగ్యము పాడవదు. అనవసరముగా డబ్బు ఖర్చవదు. నిత్యకృత్యములలో ఎక్కువ శ్రమలేకుండా, ఎక్కువఖర్చు కాకుండా చేసుకొనేపదార్థములు ఎన్నో వున్నవి. మనము ఆడవాళ్లమైపుట్టి యీ మాత్రపు పనులకు బద్ధగించిన, డబ్బుపాడు, రోగ్యముపాడు. కాబట్టి, సాధ్యమైనంత మట్టుకు ఏ రోజు టిఫిను ఆ రోజు మితముగా చేసుకున్న, శ్రమ ఎక్కువయాతనవుండదు. తక్కువగా చేసుకోవడములో రుచికూడా ఎక్కువగానుండును.

పవూటలా అన్నము పెట్టుటే బిడ్డలకు ఆరోగ్యము. కాఫీ, టీలు ఎంత మాత్రం మంచివికాదు. అప్పుడప్పుడు ఏమన్నా అడుగుట బిడ్డలకు అలవాటు. అప్పుడు యివిగో డబ్బులు బజారులో, కొనుక్కోమని చెప్పేకంటే, ఆ డబ్బుతో యింట్లో చేసుకున్న అంతా తినవచ్చును. ఆరోగ్యముపాడవదు. బిడ్డల సంరక్షణలో తల్లిచేయవలసినది ఎంతైనావున్నది. నేను ఎక్కువ చదువుకున్నదానను కాకపోయినా యింటి పనులలో చాలా మెళుకువగాను, బిడ్డల పోషణలోనే, ఏ ప్రొద్దు కాలక్షేపము జరుగుచుండును. నేను ఏమిచేసినా యింటి యజమానిగారికికూడా ఎంతో ఆనందముగానుండి నా పైనకంటె, నేను చేసేపదార్థములను ఎక్కువగా ప్రేమిస్తారని వ్రాయడానికి సాహసిస్తున్నాను. ప్రస్తుతానికి శలవు.

కె. సత్యవతమ్మ





## చుండల్ (గుగ్గిళ్లు)

ఈ చుండల్ (గుగ్గిళ్లు) చేయుటకు శనగలు, పెసలు, కారామళ్లు లేక అలచందలు వ కాయధాన్యము నుపయోగింతురు.

శనగలు బాగుగ నానబెట్టి పిమ్మట యుడుకబెట్టి తరువాత తిరుగపోతలో పోయవలెను ఆరువరకు, తిరుగపోతలో ఉంచవలెను.

ముడిశనగలుగాని ఇతర కాయధాన్యముగాని శేరు 1—కి

| | | |
|---|---|---|
| యెండు మిరపకాయలు | 1/2 | పలము |
| ఉప్పు | 1/8 | శేరు |
| ఇంగువ | 1/4 | పలము |
| నూనె | 1 | పలము |
| కరివేపాకు | | |

వారివారి ఇష్టానుసారము తిరుగపోతలో పచ్చికొబ్బరి తురుముగాని పెసల వడపప్పుగాని మామిడి ముక్కలుగాని చిన్న చిన్న వడముక్కలుగాని వేసుకొనవచ్చును. ఉప్పు వారివారి వాడుకప్రకారము ఉడికిన శనగలమీదగాని తిరుగపోతలోగాని వేసుకొంటారు.

## జీరా

గోధుమ రవ ఒక శేరుకు—

| | | |
|---|---|---|
| బూరాచక్కెర | 1 1/4 | వీశ |
| ద్రాక్ష | 2 1/2 | పలములు |
| నెయ్యి | 1/2 | వీశ |
| ముంతమామిడిపప్పు | 5 | పలములు |
| యాలక్కాయలు | 1/2 | పలము |

## కదంబము

పేరువలననే అనేకములు కలిసినది కదంబము అని స్ఫురించగలదు. ఇది సాధారణముగ భూరిసమారాధనమువంటిది. గొప్ప యుత్సవములలో, ముఖ్యముగా తిరునాళ్లదినములలో యాత్రికులు దేశాంతరులు, బహుజనము అన్నమునకై దేవాలయమునకు పోవుదురు. దేవాలయాధికారులు, ఆయాదినపు ఉత్సవముల ఉభయకర్తలు, కొంతమందికి దేశాంతరసాదము నిత్తురు. అందుకు సాధకములు వేరుగను, అన్నము వేరుగను, చేయుటకు బదులుగ, అన్నము శాకాదులు, సూపాదులు, అన్నికలిపి ఒకటిగానే వండి దేశాంతరులకు కొలత గిన్నెలతో నిత్తురు. ఇది పులగమువలె గాని లేక కాయగూరలు కలిసిన పప్పుపులగమువలె గాని రుచిగా నుండును. అందుచే దీనికి కదంబమని పేరు.

కదంబవస్తు సామగ్రి:-తళియ 1-కి

| | | | | | |
|---|---|---|---|---|---|
| బియ్యము | 3½ | శేర్లు | ఉప్పు | ¾ | శేరు |
| కందిపప్పు | 1 | శేరు | మంచి నూనె | ¼ | వీశ |
| చింతపండు | ¾ | వీశ | నెయ్యి | 15 | పలములు |
| ఇంగువ | ¾ | పలము | మినప పప్పు | ¼ | శేరు |
| ఎండు మిరపకాయలు | ¼ | వీశ | శనగ పప్పు | ½ | శేరు |
| ఆవాలు | 5 | పలము | అలచందలు | ½ | శేరు |
| మెంతులు | 1 | పలము | అనుములు | ½ | శేరు |
| ధనియాలు | ½ | శేరు | బియ్యపు పిండి | ½ | శేరు |
| పసుపుపొడి | ½ | పలము | | | |

దీనికి కూరకాయలు

| | | | | | |
|---|---|---|---|---|---|
| బెండకాయలు | 1 | వీశ | పచ్చిమిరప | ¼ | వీశ |
| కాకర కాయలు | 1 | వీశ | తియ్యకంద | 1 | వీశ |
| వంకాయలు | 1½ | వీశ | చామగడ్డలు | 2 | వీశలు |
| దోసకాయలు | 1 | వీశ | గెనుసు గడ్డలు | 1 | వీశ |
| గోరుచిక్కుడు | 1 | వీశ | | | |

తోటకూర కాడలు తగినట్లుగా

| | | | |
|---|---|---|---|
| బూడిద గుమ్మడికాయ | 1 టి | ఉస్తివరుగుగాని కాయగాని ½ [illegible] | |
| మంచి గుమ్మడికాయ | 1 టి | కొత్తిమెరి ఆకు | తగినట్లు |
| బొంత అరటికాయలు | 15 | కరివేపాకు | తగినట్లు |
| అరటి బొందె | 1 చెట్టుది | అల్లము | తగినట్లు |

పై కాయకూరలు దొరికినమట్టుకు చేర్చుకొనవచ్చును.

కొందరు మజ్జిగపులుసులోవలె కదంబములోను వడుక్కలు వేయుటకలదు. అట్లు వేయునెడల కదంబము ఒకతళియకు అదనముగా పట్టీలో చేర్చవలసిన సామగ్రి:-

మినపపప్పు ¾ శేరు
శనగపిండి ¾ శేరు
నెయ్యి 7½ పలములు

ఈ ప్రసాదముల విషయములో-తిరుపతికి ఉత్తరమున నెల్లూరిలోనే దాక్షిణాత్యవైష్ణవ సాంప్రదాయము కానవగును. ఆఉత్తరమునగల వైష్ణవక్షేత్రములలో ప్రసాదముల రుచిపాకములు వేరు. నెల్లూరి నుండి దక్షిణమునగల వైష్ణవాలయములలోను ఒక్కొక్కచోనొక్కొక్కటి ప్రసిద్ధి. నెల్లూరి పులిహోర మేలురకము అని ఇదివరలోనే చెప్పితిమి. అల్లే తిరుపతిలో వడ, మనోహరం ప్రసిద్ధములు. కంచి వరదరాజ స్వామి ఇడ్డెన, చక్కెరపొంగలి చక్కగా చేయించుకొనును. నెల్లూరులోను కంచిఇడ్డెనవలె చేయుదురు.

# బ్రతుకు తెరువు

లోగడ ఈ సం॥ జనవరి సంచికలో తేనెపట్టులు పట్టించి తేనె సేకరించుట బ్రతుకు తెరువు అని వ్రాసియుంటిని. దానినిగూర్చి మరికొన్ని వివరముల నిచ్చట నివ్వదలంచితిని.

తేనెపట్టులు పట్టించుట ఎంతో ఆహ్లాదకరమైన విషయము. ప్రకృతి క్రిమికీటకాదులును ఆహార వస్తుసేకరణమునను, సంగ్రహమునను, నిలువయుంచుటయందును, దానిని కాపాడుటయందును, మానవులవలెనే తాపత్రయపడుచుండుట చూడ చోద్యముగ నుండును.

“తేనెటీగలు జాగ్రత్తచేసిన తేనెను మనము తాగుచున్నామే; వానిని దోచుకొనుచున్నామే” అని ఎవ్వరును దిగులు పడనక్కరలేదు; పూవుపై వ్రాలి చుంబించినప్పుడే తేనెటీగ కడుపార మధువును గ్రోలుచున్నది. ఇంటివద్దనున్న సోమరి ఈగలకై మరికొంత తెచ్చుచున్నది. అదియు ఆరగింపగా మిగిలినదే నిలువ చేయునది. ఆవును పెంచి దానిపాల నెట్లు గ్రహించుచున్నామో తేనెటీగల పెంచి వాని తేనెను గ్రహించుచున్నాము. ఇందు తప్పేమియు లేదు.

అయితే ఆవునకు ప్రతినిత్యమున్నూ గడ్డిగాదము వేసి, చిట్టు తవుడు పెట్టి, నీళ్లు కుడితి త్రాగించవలసి యున్నది. తేనెటీగల కట్లుగాక, తేనెపట్టులుంచు పెట్టెలనుకొనుటకున్నూ, తేనెపట్టులనుండి తేనెగ్రహించుట కుపయోగించు సాధనములకొనుటకున్నూ వెచ్చమగునదే ఖర్చు. ఆ పైన నేమియు ఖర్చుపెట్టనక్కరలేదు.

ఇందు ముఖ్యముగా కొనవలసినవి—తేనె పట్టుపెట్టెలు, ఈ పనిచేయునప్పుడు తేనెటీగలు కుట్టకుండా వేసుకొనవలసిన ముసుగుగుడ్డ, చేతికి తొడుగుకోవలసిన మేజోళ్లు, పొగవేయు సాధనము, తేనె పిండు సాధనము మున్నగునవి. ఇందు తేనెపట్టుపెట్టెతప్ప మిగతవన్నియు ఒకపట్టు పెట్టించినను పదిపెట్టించినను కొనవలసినవే. ఎన్నిపెట్టినను ఒక్కసెట్టుమాత్రమే చాలును. కావున ఒక్కసెట్టు ఇతర సాధనములుకొని— మొదట రెండు పట్టుపెట్టెలతో ప్రారంభించవచ్చును. అవల తేనెపట్టుపెట్టెలు మాత్రమే కొనవచ్చును. ఇవన్నియు మొత్తము రు 75-లు లోపుగనేయుండునట. ఒక్కొక్క పెట్టె రు 10-లగును. స్వంతముగ చేయించుకొన్నచో ఇంకా చౌకయగును.

బాగుగా తర్ఫీదైనమనిషి తనవృత్తి తాను చూచుకొనుచు 40 తేనెపట్టుల దాకా సేవరింప వచ్చును. కొత్తవారు ముందు ఒకటి రెండు పెట్టెలతో ప్రారంభించి అనుభవముకలుగుకొలది క్రమముగా వృద్ధిపరుప వచ్చును. రెండుపట్టులను సవరించుటకు ఒకమనిషి వారమునకు అరగంటకంటె హెచ్చుకాలము వినియోగింప నవసరములేదు. ఒక పట్టునుంచుటకు రెండుగజాల చదరం కంటే హెచ్చుస్థలం అవసరంలేదు.

ఈ తేనె సేకరించడం అంతా ఒకచిత్రం. సృష్టిరహస్యమే ఇందులో ఇమిడియున్నది. తేనెటీగలు ఎక్కడినుంచో తేనె దోచుకొనివచ్చి మానవుడి కిస్తున్న వనుకోరాదు. చెట్లుచేమలు, తీగలు పొదలు స్థావరాలు.

అయినా సృష్టిక్రమం నడుస్తున్నది. ఎట్లానడుస్తున్నది. వీటికి పూలు అని ఒకటి ఏర్పరచాడు సృష్టికర్త. ఈ పూలల్లో కొన్నిటిని ఆడపూలు, కొన్నిటిని మగపూలు చేశాడు. కొన్ని పూలల్లో రెండు సన్నివేశాలు ఏర్పాటుచేశాడు.

అయితే ఈ స్త్రీపురుష ప్రకృతుల సంయోగము కావాలిగదా. అందుకని పూలకు రంగులు వాసనా మొదలైన ఆకర్షణలు పెట్టాడు. ఆ ఆకర్షణకు తేనెటీగలువచ్చి పూలమీదవాలుతున్నవి. అవాలినప్పుడు వాటిరెక్కలకు మగపూలలో - అమర్చబడిన పుప్పొడి అంటుకున్నది; ఆ పుప్పొడిఆడపూలమీద వ్రాలినప్పుడు దానిగిన్నలో రాలుతున్నది. అయితే ఈ తేనెటీగలు సుశిక్షితమైన నౌకర్లవలె క్రమం

ఎప్పుడూ ముందు మగపూలమీద వ్రాలి పిదప ఆడపూలమీద వాలుతుంటాయా? లేదు; ఒక్కొక్కసారి వరుసగా ఆడపూలమీదనే వ్రాలవచ్చు. ముందు ఆడపూవుమీద వ్రాలి అవలనేపోయి మగపూవుమీదనే వ్రాలవచ్చు. వరసగా మగపూలమీదనే వ్రాలవచ్చు. అయితే సృష్టికర్త జాణ. వాసనకురంగుకుభ్రమసివచ్చి ఏ ఒకటిరెండుపూలమీదనో వ్రాలిపోకుండా - ఇంకా ఆ పూలయందొక స్థిరప్రయోజనం ఏర్పరచాడు. అందులో కాస్తకోరు తియ్యనయ్యే పదార్థమును—అమృతాన్ని—తేనెను ఉంచాడు. అదీ చాలా కొంచమే ఉంచాడు. అయినా దాని కడుపెంత? రెండుమూడు పూలల్లోది త్రాగేసరికి గ్రుడ్రున నిండుతుంది. ఇక నాపూట మళ్లీ ఆ పూలమొగము చూడదు. అందుచేత మగఈగలను సోమరుల నొనర్చి గా వాటికొక ఇల్లు, ఆ ఇంటివద్ద అవి ఉండడం. అందుచే తేనెటీగ పీల్చి పీల్చకముందే ఇట్లు ఇంటివద్దఉన్న మగఈగలు స్ఫురణకు వచ్చి—అక్కడకు పరుగెత్తికెళ్లి—ఇంటివద్ద గూటిలో నిక్షేపించి వచ్చేస్తుంది. ఈవిధంగా రోజంతా తిరగడమే. అందుచేతనే "ఎన్నిపూలపై వ్రాలదు తేటి" అని కవులు వర్ణించారు. మగపూలలోని పుప్పొడి తెచ్చి ఆడపూలలో విసర్జించేసరికి ఆపూలు గర్భం దాల్చి కాయకాస్తున్నవి. అవిపండి ఫలిస్తున్నవి. ఆ పండ్లు మానవులకు చిలుకలు మొదలైన పక్షులకు, కోతులు మున్నగు జంతుజాలానికి ఆహారమవుతున్నవి. ఆ విత్తనములు - పునఃసృష్టికి బీజాలవుతున్నవి. ఈవిధంగా తేనెటీగ తన కడుపార తేనెత్రాగి మగఈగల (సోమరి) తృప్తిపరచి మిగలగా కూడబెట్టినదే. ఈవిధంగా నీకు భగవంతుడు ఇచ్చిన తీరిక కొద్దీ సృష్టిలో జరిగే ఒక గొప్ప చిత్రాన్ని, ఒకగొప్ప ఉద్యమాన్ని తిలకించగలవు.

'నేను పేదదానిని నాకు తోటలేదు; దొడ్డిలేదు' అనుకోనక్కరలేదు. నీవు తేనెపట్టులు పెట్టినట్లయితే తోటదొడ్డిఉన్న నీప్రక్క ఇంటి సంపన్నులు సంతోషిస్తారు. నీవు పడేశ్రమకు, నీకు తేనె దొరకడమేగాక వాళ్ళతోటలలో నిమ్మ, దానిమ్మ, పనస, మామిడి, జామ సపోటా మొదలైన చెట్లన్ని ఇక మిక్కిలిగా ఫలిస్తవి. రెండుమైళ్లలోఉండే తోటకైనవెళ్లి తేనెటీగలు తేనెతెస్తవి.

ఈ పరిశ్రమ అమెరికాలోను యూరపుదేశాలలోను బాగా అభివృద్ధిచెందినది. ఇది వ్యవసాయాన్ని ఆశ్రయించిన పరిశ్రమ. ప్రపంచంలో గొప్ప వ్యవసాయదేశమని పేరుగాంచినా మనదేశంలో ఈపరిశ్రమ వృద్ధి పొందలేదు. మనం విదేశాలనుంచీ తేనెకూడా దిగుమతి చేస్తున్నాము అంటే సిగ్గుచేటుకదూ!

అమెరికాలో ఈ పరిశ్రమవల్ల బాగా తేనె ఉత్పత్తి చేయగలుగుతున్నారు. పంజాబులో ప్రభుత్వం వారు ఏర్పరచిన ఫారంలో సగటున పట్టుకు సాలినా 60 పౌ॥ల తేనె వచ్చిందట. అమెరికాలో ఇంతకన్న హెచ్చేవస్తుంది. అయితే ప్రారంభదశలో పట్టుకు 40 పౌ॥లు రావచ్చు. రెండుపట్టులు పెట్టితే పని హెచ్చుగాదు. విదేశపు తేనెలు పౌ॥ 1-కి రు 2 అంతకు మించికూడా ధర ఉన్నది. తరుగులు, ఖర్చులు తీసివేయగా - పడ్డ శ్రమకు మించిన లాభమేవస్తుంది.

పైగా ఈ వ్యాసంగంలో ఎంతో అందం, ఆనందం, మాధుర్యం ఉన్నాయి.

తేనె చాలా ప్రాచీనమైన తీపిపదార్థము. తద్దినాలలో బ్రాహ్మణులుచెప్పే మంత్రాలలో తేనె వడ్డించమని ఒక మంత్రం వస్తుంది. అయితే కొంతమంది బ్రాహ్మణులకుగాని, కర్తకుగాని ఆసంగతేలేదు. తెలిసినా ఆ భోక్తలకు ఆవపచ్చడిలో తిరుగపోతవల్లవచ్చే ఘాటుముందర తేనెమీద భ్రమపారదు. కొంత మంది ఛాందసులు ప్రత్యామ్నాయం బెల్లంముక్క అడిగి దానిని ఉదరిణెకు నీళ్ళలోకలిపి ఒకప్రక్కన వడ్డించుకుంటారు. అట్టి పూర్వపుమంత్రాలలో తేనెవస్తుందంటే తేనె ఆర్యులకు ప్రాచీనమైన ఆహారము. అతిథి అభ్యాగతులకు మధుపర్కముతో అనగా పెరుగుతోకూడిన తేనెతో ఆతిథ్యము ఇవ్వమన్నారు. ఇప్పుడు పెళ్లిలో వధూవరులకుకట్టనిచ్చే వస్త్రాలకే ఆ పేరు మిగిలినది చక్కెరలో తీపిఉన్నా చక్కెరకున్న చెడుగు తేనెకులేదు. పైగాచక్కెరలో లేని విటమినులు తేనెలో ఉన్నవి. కాబట్టి గృహలక్ష్ములకు తేనెపట్టుం చడము మంచి బ్రతుకుతెరువు. తాను శ్రమపడి తయారుచేసిన తేనె తానూ, తనభర్త, బిడ్డలు ఆరగిస్తుంటే స్వర్గంగా ఉంటుంది! జిహ్వేకాదు; జీవితమే!!

# లోకవార్తలు

నెల్లూరినుండి నేతిడబ్బాలలో "వెన్న" పేరట బియ్యమును రైలులోపంపగా పోలీసులు తెలుసుకొని పట్టుకున్నారు.

*　　　*　　　*

భద్రాచలం చుట్టుప్రక్కల మశూచికము వ్యాపించియున్నందున ఈసారి శ్రీరామనవమికి ప్రత్యేకపు ప్రయాణపు సౌకర్యము ఏర్పరుపబడలేదు.

*　　　*　　　*

చెన్నపట్నంలో "పవర్ సోడా" అనే మారుపేరుతో - "మద్యము" విక్రయింపబడుచున్నదని శివరత్నంగారు కార్పొరేషన్‌లో చెప్పినారు.

*　　　*　　　*

అలాస్కా అనే దేశంలో 40000 మగవారు; 20000 మందే ఆడువారు, అయినా చాలామంది పురుషులు అవివాహితలట. అందుచేత అచ్చటి శాసనసభలో పెండ్లికానియువకులు తల 1 కి సం|| నకు 1 పౌ. 10 షిల్లింగులు. (సుమారు 165 రూ|| లు.) పన్ను ఇచ్చుకోవలెనని బిల్లు ప్రవేశపెట్టబడినది.

*　　　*　　　*

పారిస్‌నగరమందలి విజ్ఞానశాస్త్ర పరిషత్తునందు శ్రీ సర్. సి. వి. రామన్ గారిని సభ్యులుగా నియమించుకున్నారు. ఆసియా ఖండవాసులలో నీగౌరవము పొందినవా రిప్పటికివీరే.

*　　　*　　　*

కెన్యాలో విమానము నడిపే బ్రిటిష్‌వాడొకడు ఆఫ్రికాదేశపుస్త్రీని తుపాకితో కాల్చిచంపినాడు. ఆ నేరానికి అతనికి 8 నెలలు కఠినశిక్ష వేశారు !

*　　　*　　　*

ఇటీవల కలకత్తానుండి 1000 కోతులు అమెరికాకు ఎగుమతిఅయినవి. ఈవిధంగా వాళ్లు పిట్టలు కోతులు మనదేశాలనుంచి తెప్పించుకొంటున్నారు. వీటిని వైద్యపరిశోధనకు క్రొత్తఆయుధసామగ్రి పరీక్షకు ఉపయోగిస్తారట.

*　　　*　　　*

---

(204 వ-పుట తరువాయి)

చం:-మతి బాలకుని చదువుమాట.

హి:-వాడికింకా చదువు! వాడి చదువిక మృత్యు సన్నిధిలోనే.

చం:-చేతనైనంత వఱకు చెప్పిచూడవలయునుగదా? గృహస్థ ధర్మములు నేర్ప మందురా?

హి:-మీ యిష్టం. (తెర)

గ్రీక్ పురాణాలలో భయంకరమైన వికృతాకారమూర్తి వర్ణింపబడినది. దానికి స్త్రీతల అను సింహపుదేహము. అది అరణ్యాలలో దారులుకాచి ప్రయాణీకులను యక్షప్రశ్నలు వేసేది. వానికి జవాబు చెప్పలేనివారిని గొంతుపిసికి చంపేది. దానిని స్ఫింగ్క్స్ (Sphinx) అన్నారు. ఆమూర్తిని ఈజిప్టులో శిల్పులు రాతిలో చెక్కినారు. ఇటీవల అట్టి "నారీసింహిక" విగ్రహములెన్నో ఆదేశంలో కన్పించినవట. వాటిఎత్తు 10 అ॥ లున్నవట.

* * *

న్యూయార్కులో (అమెరికా) శాట్టర్త్ వెయిట్ అని 56 సం॥ల ఇల్లాలు. ఆమె గత రెండు నెలల్లో 60 మంది శిశువులను అమ్మినదట. ఈ విధంగా గత 4, 5 సం॥లలో వందలకొలది బిడ్డల అమ్మినదట. ప్రపంచంలో ఎక్కడికైనా ఆమె నిట్లా బిడ్డలను వెలకు విమానంలో రవాణాచేసేదట. ఇందుకుగాను ఆమె అవివాహితలుగా గర్భిణీదాల్చిన వారి శిశువులను సర్వహక్కులతో కొనేదట. ఆ శిశువులను కావలసినవారికి అపారమైన ధనానికి విక్రయించేదట. ఆమె నిప్పుడు అరెస్టుచేసి కేసుపెట్టినారు.

* * *

ఆస్ట్రేలియాలో ప్రసూతి చికిత్సాలయంలో ఇద్దరి శిశువులు తారుమారైనారు. ఇప్పుడా యిద్దరి తల్లులు ఒకే శిశువు కొరకు నాది అంటే నాది అని తగవులాడుచున్నారు. తుదకు కోర్టుకెక్కారు. విక్టోరియా రాష్ట్రపు ఫుల్ కోర్టువారు ఆ శిశువును ఒకతల్లి కిప్పించారు. రెండవ ఆమె ప్రివీకౌన్సిల్ లో అపీలుచేస్తున్నది.

* * *

1946 సం॥లో బ్రిటిష్ దీవులలో విడాకు లంగీకరింప బడుటచే 30,298 వివాహాలు విచ్ఛేదమైనాయి. అయితే ఆ సం॥ము జననములు 8,20,719. ఈ తల్లులలో 23 మంది,50 సం॥లు దాటిన వారున్నా ఉన్నారట. ఈ జననముల సంఖ్య అంతకుముందు సం॥పు సంఖ్యకు రెండురెట్లు. 23 సం॥లలో ఇంత హెచ్చుగా జననములు జరిగియుండలేదు.

* * *

ఇంగ్లాండులో క్రొత్తరకపు పాంటెక్ పేనా కనిపెట్టబడినది. ఈమే నెల 2 వ తేదిన బర్మింగ్ హామ్లో జరిగే వస్తుప్రదర్శనమున దానిని ప్రదర్శింతురు. దీని పాళీ కొనన బుడుపు అమర్చినారుట.

* * *

అమెరికాలో హార్వర్డ్ విశ్వవిద్యాలయ విద్యార్థులు పరిశోధనలొనర్చి - "పురుషులకు స్వతస్సిద్ధమైన దౌర్బల్యముకలదు." అని కనుక్కొన్నారు. నిజానికి పురుషుడే — జీవితమంతా "అబలుడ"ట! అమెరికాలో మరోవైపరీత్యము జరుగుచున్నది. 1910 లో స్త్రీలకంటే పురుషులు 27,00,000 హెచ్చుండిరి. ఇప్పుడు స్త్రీలే పురుషులకన్న 4,93,000 మంది ఎక్కువట.

* * *

క్లీవ్లాండ్ (ఓహియో)లో ఇద్దరు డాక్టర్లు పరిశోధన చేశారు. ఫలితము: 20 సం॥లకుపై వయస్సున చనిపోయిన పురుషులలో ప్రతి 100 వివాహితులకు, 141 రు అవివాహితులున్నారట. అట్లే స్త్రీలలో ప్రతి 100 రు వివాహితలకు 117 అవివాహితలు తేలినారట. అవివాహితులలో చావక మిగిలిన వారి గతిమరీ అధ్వాన్నము. వారికే నరముల జబ్బులు, మనోవైకల్యములు, హృద్రోగములు, మేహ వ్రణాలు, క్షయవ్యాధి, హఠాన్మరణాలు, ఆత్మహత్యలు — హెచ్చు.

* * *

ఫావుజియా రాకుమారి ఈజిప్టురాజు ఫరూకీ చెల్లెలు. ఈమె ఇటీవలనే పారసీకదేశపురాజు గారితో విడాకులు పుచ్చుకొన్నది. ప్రస్తుతం ఈజిప్టు రాజ్యంలో గొప్ప అధికారితో ఈమె పునర్వివాహం జరిగినది. వరుడు కేంబ్రిడ్జ్ లో చదివిన విద్యాధికుడు. ఈమెకు పూర్వభర్తవల్ల 8 సం॥ల కుమార్తె ఉన్నది. వెనుకటి వివాహ విచ్ఛేదానికి కారణము — పారసీకదేశపు వాతావరణంలో — ఈమె ఆరోగ్య భంగం అవుతుందనే భయముగా చెప్పబడినది.

హృదయాకర్షణమైన
ఘట్టములతో నిండిన
ఒక సామాన్య
జీవిత గాధ



జూపిటర్
వేలైకారి
దాసీకన్య

తెనుగు సంవత్సరాదికి
తేది 30 విడుదల




పూర్ణా రిలీస్

30.3.49నుండి—విజయవాడలో - జయ్ హింద్, రాజమండ్రిలో - కృష్ణా, విశాఖపట్టణములో - పూర్ణా,
గుంటూరులో - న్యూసిటీ, నెల్లూరులో - వినాయక్, తెనాలిలో - స్వరాజ్య, టాకీసులలో విడుదల,
త్వరలోనే కాకినాడలో - మెజస్టిక్ టాకీసులోకూడ.

# శ్రీ సింహాచల క్షేత్రము

గంటి సూర్యనారాయణ శాస్త్రిగారు

శ్రీ ఆదివరాహక్షేత్ర రాజాంతర్గతమగు నీ సింహాచలక్షేత్రరాజము శ్రీమత్కళింగ విజయనగర సంస్థానాధీశ్వరుల ధర్మకర్తృత్వమునగలదు. ఆసేతు శీతాచలాంతముగల భారత భూభాగమున విలసిల్లిన క్షేత్రరాజములలో నిది గణనీయస్థానము నాక్రమించియున్నది.

సింహాకారంబును నరసింహాధిష్ఠితమునగుచు జెలుగున గేంద్రం
బంహస్సంహారకరమది సింహాద్రియనంగ బరగు శివకరమగుచున్.

ధారాశీతల శీకరాన్వితములై దట్టంపు పుష్పాళ్లు సొం
పారంజిమ్ముచు మందమారుతములయ్యద్రి ప్రదేశంబునం
దారూఢంబుగవీచు సూనశరలీలాలోలవిద్యాధరీ
వారావార్యనిదాఘ వారికణసంభారంబు నింకింపుచున్.

ఇట్టి శ్రీ సింహాచలక్షేత్రరాజమునకు, వరాహలక్ష్మీనరసింహామూర్తి యధిపతి. త్రిపురాంతకుడు క్షేత్రపాలకుడు; విష్వక్సేనాంజనేయులు రక్షకులు; భైరవమాధవులు ద్వారపాలకులు; అని స్కాంద పురాణగాథకలదు. దీనినిబట్టి ఇది వైష్ణవక్షేత్ర మనబడుచున్నది. కాని, వైష్ణవాలయములలో సాధారణముగా విగ్రహములు ఆలయపు గోడల నంటియుండును. లేదా, గర్భాలయమున మూడవభాగమున నుండును. అసలు గర్భస్థస్వామి, గర్భాలయమున ప్రదక్షిణార్హుడుగ నుండడు. శైవలింగమూర్తులు ఆలయమధ్యభాగమున ప్రతిష్ఠితములై, సోమసూత్రమునుగలిగి, గర్భాలయమున ప్రదక్షిణార్హములుగ నుంటవి. శైవాగమవిధాన మీ సింహాచలమునకు సర్వదా సరిపడుచున్నది. ఇది శివాలయమా? విష్ణ్వాలయమా?

శ్రీ సింహాచలదేవ గర్భాలయమున ప్రవేశించునరికి, చందనపుపూతచే దర్శన మాత్రమున లింగాకృతియే కనుబడును. ఈ చందనలింగమూర్తి భూమట్టమున కడుగు రౌత్తునుండి యుద్భవించియున్నది. ఆ యడుగు రౌత్తునను, సుమారు రెండుమూరల నలుచదరముగల రజత పీఠమొకటికలదు. తత్పీఠమునకు నేటికికూడా సాలిగ్రామ పీఠమనియే పేరువెలసియున్నది. ఈ పీఠాధోభాగమున అనేకవందల సాలిగ్రామములుకలవు. ఇంతియేగాక, చందనలింగమున కెడమవైపున, నొక వెండిపళ్లెరమున, దశవిధసాలిగ్రామములనుంచి, విశిష్టాద్వైతమత ప్రపత్తిగల అర్చకులు, ప్రతిదినము పూజించుచుందురు. ఈ సాలిగ్రామ పళ్లెరము, చందనలింగము, సోమసూత్రము మున్నగునవి గర్భాలయముననున్న ప్రహ్లాదమందిరమునగలవు. శ్రీ సింహాచల క్షేత్రరాజమున సంవత్సరమున నొక్కదినమున మాత్రమే (వైశాఖశుద్ధ తృతీయ) "అక్షయ





కూర్చున్నవారు:—1 శ్రీమతి ఆర్. వేపా వెంకటరత్నమ్మగారు, సభ్యురాలు.
2. పాండురంగి వెంకటరమణమ్మగారు, సంఘకార్యదర్శిని.
3. ... 4. శ్రీమతి బుర్రా కమలాదేవిగారు, సంఘఅధ్యక్షురాలు.
5. మిస్. రహిమానుగారు. 6. గండికోట సావిత్రమ్మగారు.
7. అయ్యగారి సింహాద్రమ్మగారు, సంఘకోశాధికారిణి.

నిలుచున్నవారు:—1. శ్రీమతి ఎనమండ్ర సూర్యకాంతమ్మగారు, సహాయకార్యదర్శిని.
2. దువ్వూరి లలితాంబగారు. సభ్యురాలు.
3. మిస్. సహిదా. 4. మిస్. రహిదా. 5. బోడి లక్ష్మీబాయమ్మగారు; 6. కంభంపాటి పార్వతిగారు, సభ్యురాలు.

దిగువకూర్చున్నవారు:—1. కుమారి సూర్యప్రభ. 2. కుమారి లక్ష్మి.

శ్రీ ఆకెళ్ల సూర్యనారాయణ మహిళా సంఘసభ్యులు, విశాఖపట్టణము.



తృతీయ శ్రీవరాహ లక్ష్మీనరసింహస్వామి వారి దర్శనభాగ్య మలవడగలదు. మిగత సంవత్సరము పొడవునను, 12½ మణుగుల మలయజ గంధచందన లింగము, విభూతి పండు ఆకారముగలిగి లోకలోచన గోచరమగు చుండును. అక్షయ తృతీయ దినమున చందనోత్తరము గావించి, సాయంసమయమున గంగధారాజలములతో సహస్ర ఘటాభిషేకమును జేయుదురు. నిజరూపమునకు భోగరాగాదులేమియు గావింపబడవు. చందనము 3½ మణుగులుపూసి లింగాకృతియైన భగవంతునికే భోగరాగాదులానాడు గావించెదరు. "అలంకార ప్రియోవిష్ణుః అభిషేక ప్రియశ్శివః" అనుసూక్తి యిచ్చట సరిపడునా? శ్రీ వైష్ణవమూర్తికి సహస్ర ఘటాభిషేకము కల్ప సంభవమైయున్నదేమో? శ్రీవారణాసి క్షేత్రరాజమున జరుగురీతిగ నిచ్చట గూడ నక్షయ తృతీయదినమున "త్రిలోచనయాత్ర" జరుగుచున్నది. త్రిలోచనత్వము రెండు స్థలములయందును సమానమైయున్నది.

కుందాభసుందరతనుః పరిపూర్ణ చంద్రబింబాను కారి వదనో ద్విభుజ స్త్రినేత్రః
శాంత స్త్రిభంగిలలితః కటిగుప్తపాదః సింహాచలే దేవవరో నృసింహః.

అని క్షేత్రమాహాత్మ్యము వచించుచున్నది. ఫాల్గుణమాసమున కామదహన మహోత్సవము జరుగుచున్నది. వైష్ణవక్షేత్రములలో జరుగుట అసమంజసముగదా! శ్రీ సింహాద్రినాథుడు, పశ్చిమదిశాభిముఖుడై, పశ్చిమాభిముఖమగు శైలరాజమున, పశ్చిమవాహినియగు గంగధారాజలాభిషిక్తుడగుచు, భక్తుల పశ్చిమ జన్మాఘములను, పోగొట్టుచు, శివంకరుడై విరాజిల్లుచుండెను. ఈ స్వామికి యాత్రవాసులు, గుమ్మడిపళ్లు, బూడిద గుమ్మడిపళ్లు, విభూతిపళ్లు, త్రిశూలములు, పిడిగంటలు, ఆబోతుకోడెలు మున్నగువాటిని ప్రతినిత్యము సమర్పించుచుందురు. ఇవియన్నియు, శైవసాంప్రదాయ లక్షణములుగాని వైష్ణవీయములు కానేరవుకదా! ఇంతేకాదు. ఈ క్షేత్రరాజమునకు దక్షిణకాశీయను నామాంతరముకలదు. శ్రీకాశీవలెనిదియు పంచక్రోశాత్మకమై, భైరవ, మాధవ, ద్వారరక్షకులచే రక్షింపబడుచు, సకలలోక పాపపంకమును హరింపజేయు పూతగంగధారాయుతమై, విరాజిల్లుచున్నది. ఈ పర్వతరాజమునకు కైలాస పర్వతమని వృద్ధలోకము వాకొనుటయేగాక, సింహాచలదేవస్థానపు కవుల్లు, కదపాలలోను, మద్రాసు గవర్నమెంటు ఫారెస్టు రికార్డులలోనుకూడ కైలాసపర్వతమనియే నమోదుచేసియున్నది. "శ్రీసింహాచలమనే కైలాస పర్వతమందున్న అనాసతోటలు, పనసతోటలు, అరటితోటలు వగైరాలకు సాలీనా సర్కారువారు నిర్ణయించిన కిస్తును చెల్లించి రశీదును పుచ్చుకుందును" అని వ్రాసిన కాగితములుండుటయేగాక, ప్రస్తుతము రైతులు, కంట్రాక్టుదారులు, దీనిని కైలాసమనియే వాడుచున్నారు. పైప్రమాణములనుబట్టి యిది యొకప్పుడు శివాలయమని కొందరి విపశ్చిద్వర్యుల నిర్వివాదాభిప్రాయము.

ఇదే శివాలయమయినచో క్షేత్రపాలకుడు త్రిపురాంతకస్వామి యుండుటకు వలనుపడదు. శైవాలయములకు వైష్ణవ మూర్తులు, వైష్ణవాలయములకు శైవమూర్తులు క్షేత్రపాలకత్వమున నుండుట ఆగమ శాస్త్రవిధియైయున్నది. అందుచే నిది వైష్ణవాలయమని యనువారికి శివాలయవాదుల ప్రత్యుత్తరము. శ్రీసింహాద్రినాథునకు క్షేత్రపాలకుడు శ్రీ హరి. "వైకుంఠవాసుని మెట్ట" యని యొక గుట్ట. శ్రీ స్వామి వారి యాలయమున కుత్తరమునగలదు. ఇచ్చట శ్రీ భూ సమేతుడగు శ్రీ మన్నారాయణుని విగ్రహము దివ్యకళతో కొంచెము భిన్నమై యిప్పటికిని కలదు. పూర్వమొకప్పు డిచ్చట నాలయ ముండియుండును. భూగర్భమున పునాదులుకలవు. ఆ దివ్యవిగ్రహమునకు పురోభాగమున గరుడాళ్వారు కరములు ముకుళించియున్నవాడు. సింహాద్రినింకెక్కడను ప్రత్యేకముగ గరుడాళ్వారులు కనుపడరు. సవాహనుడై, సపత్నీకుడై, శ్రీమన్నారాయణుడు క్షేత్రపాలకుడై, యున్నత ప్రదేశము నాక్రమించుకొని యుండెనని శివాలయవాదుల ప్రబలప్రమాణమైయున్నది. ఈ వాదమును మరింతగా బలపరచుచున్నది. "సింహాద్రి అప్పన్న"

అనుపదరాజము. అపర్ణా శబ్దజనకము అప్పన్న. అపర్ణా అనగాపార్వతి, దుర్గాదేవి, సింహాకారముగు సింహాచల సింహాసనమున త్రిపురాంతకునితో విరాజిల్లుచున్నది. వైకుంఠవాసుని మెట్టనంటిపెట్టుకొని యున్న, శ్రీ, భూ సమేతుడగు నారాయణుడు క్షేత్రపాలకుడు. భైరవ, మాధవులు క్షేత్రపాలకులు. అప్పన్న అనునది అర్పణ శబ్దభవమనిన్నీ, అప్ప, అన్న అనునవి జనకవాచకములనిన్నీ, మరియొక వాదము. "అప్పన్న అప్పనం" అనుటలో అప్పన శబ్దమునకు 'ముడుపు' అని యర్థము. అప్పనములను గ్రహించు స్వామిగాన అప్పనస్వామి - అప్పలస్వామి యయ్యెనని విమర్శకుల సునిశితవిమర్శ. పై నుదాహరించిన ప్రమాణములనుబట్టిచూడ నిది శైవాలయమనిన్నీ, విశిష్టాద్వైతమత ప్రతిపాదకులగు శ్రీరామానుజాచార్యుల వారికి పూర్వము యీ యాంధ్రదేశమనంతములగు శైవాలయములతో తులదూగుచున్నట్లున్ను, [illegible]ములగు నొకటిరెండు వైష్ణవాలయములు మాత్రమే తత్సమయమున వెలసియుండినట్లున్ను, పండితులు, పరిశోధకులు, చారిత్రికుల నుడివియుండిరి. శ్రీరామానుజాచార్యులవారు దేశసంచారమునకువెడలి, స్వమత ప్రచారముతోబాటు శివాలయములను, విష్ణ్వాలయములుగ మార్చినట్లు అనేక విద్వాంసులు వ్రాసిన వ్రాతలు, కింవదంతులు అనేకములు కలవు. ఈ యాలయ సంబంధగాథను సంక్షేపముగ వ్రాసి, చరిత్రకుజనెదను.

పూర్వమొకప్పుడు శ్రీరామానుజాచార్యులవారు యీ సింహగిరికి - దయచేసిన సమయమున, శ్రీ యాచార్యులవారికి, యిచ్చట స్థిరనివాసమును జేసికొనియున్న శైవపండితులకు మతచర్చలు జరిగినట్లును, తత్సమయమున శ్రీరామానుజాచార్యులవారు సింహగిరియందుగల శైవమూర్తిని రాతో రాతున(?) వరాహాకృతిగ చెక్కినట్లును, పాదములను చెక్కునంతలో తెల్లవారుటచేత నా పని పూర్తికాకుండ నిలిచిపోయినట్లున్ను, శైవులు ప్రాతఃకాలమున గర్భాలయములను ప్రవేశించుసరికి పరకాయప్రవేశ మహిమాన్వితులగు రామానుజాచార్యులవారు సర్పరూపమున బయటకువచ్చుట గాంచినట్లును, తద్వైష్ణవ కృత్యమును పండితులు తెలుసుకుని ముష్టాముష్టి కేశాకేశివరకు వెళ్లి, సంవత్సరమునకు ఒకదినముమాత్రమే వరాహరూపమును నుంచుటకున్ను, మిగత సంవత్సరము చందనలింగమూర్తిగ నుంచుటకును, సంధిగావించుకొనినట్లున్ను బహుపండితజనుల కింవదంతులు విస్తారముగగలవు. ఈ కింవదంతులనుబట్టిచూడ శ్రీరామానుజాచార్యుల వారికాలమున వరాహముఖమును సింహాద్రినాథుడు గ్రహించినట్లు తేలుచున్నది. విశిష్టాద్వైతమత ప్రవక్తలుమాత్ర మిప్పటికి కూడ కృతయుగమున ప్రహ్లాదుడు ప్రతిష్ఠించిన మూర్తియే యిదియని నుడువుచుండిరి. పురూరవచక్రవర్తి యాగావర్తమున పునఃప్రతిష్ఠించి యాలయగోపురాదులను నిర్మించినట్లు మరియొక పురాణ గాథకలదు.

పదునెనిమిదవ శతాబ్దప్రారంభమున ముష్కరతురుష్కయోధులు, విశాఖమండలమున వీరప్రతాపమునుజూపి, పట్టణారాజములను, పరమపవిత్రములైన హిందూదేవాలయములను, నిత్యకర్మానుష్ఠానదీక్షాదక్షులగు భూసురోత్తముల యజ్ఞశాలలను పడగొట్టి, పాడుచేసి, పరిపరివిధముల ప్రజానీకమును పరారీ చేయించి పరువులు పెట్టించిరి. తురకలదండు గండుమీరి చండప్రచండ పరాక్రమోద్ధతుల నుగ్గడించుచు, సింహాద్రికివచ్చుసరికి, భగవద్భక్తులును, సంస్కృతాంధ్రపార్సీ భాషాపండితులును అగు శ్రీగోకులపాటి కూర్మనాథకవి భక్తావతంసుడు, స్థానాచార్యపదవియందుండి, వైరిహరరంహా! సింహాద్రి నారసింహా! అనుమకుటమున నిందాస్తుతి రూపపద్యముల చెప్పెను.

మచ్చునకు రెండు పద్యములు:—

మొరవోయెనో వక్రముఖ నక్రహర మహాసంపర్క నిర్వక్ర చక్రధార
వాసి దప్పెనో హతోద్భాసి సుమాలి మహాసుర శార్ఙ్గబాణాసనంబు

పదునువాసెనో మధుప్రముఖేంద్ర రిపురాజ బృందాంత కారక నందకంబు
కడిమిదప్పెనో సౌంభకమథ ప్రథవిధాన చండమైదగు గదాఖండ పటిమ
జబ్బుపడి యుంటివేల మాయబ్బ! యొక్క దెబ్బతీయక తురకల యుబ్బుచెడదు
గొబ్బునచెలంగు మికనైన నిబ్బరముగ వైరిహారరంహా! సింహాద్రినారసింహా!

దర్పణాకృతి తళతళలాడు కంబాలు, డంబైచెలంగు బేడాహారంగు
చెప్పచూపగరాని యొప్పున నుప్పరం బప్పళించెడు వంకకొప్పుచొప్ప
చిత్రవిచిత్రమౌ చిత్రింపు బొమ్మల గులుకు చక్కని గుళ్ల గోపురములు
నమృతోపమానమై యలరారు గాంగధారాముఖ్య సకల ధారాజలంబు
నెంతముచ్చటపడి సృజియించినావు, యిల్లు చెడగొట్టు కొనకు నన్నేలినయ్య
ఘనతురుష్కుల బడగొట్ట మనసుబెట్టు; వైరిహారరంహా! సింహాద్రినారసింహా!

ఈ విధముగ నరువది యెనిమిది పద్యములుచ్ఛరించు సరికి గండుతుమ్మెద లుద్భవించి, తురకలదండును వాలితేరువద్దనున్న మెట్టవరకు దరిమివేసినవి. ఆ మెట్ట కిప్పటికిని తుమ్మెదల మెట్టయని పేరుగలదు. మిగతా పద్యములలో తన అపరాధములను మన్నించమని ప్రార్థించి శతకమును పూరించెను.

శివాయ విష్ణురూపాయ శివరూపాయ విష్ణవే,
శివస్య హృదయగ్ం విష్ణుః విష్ణోః హృదయగ్ంశివః.

అను శ్లోకమునకు ప్రత్యక్ష ప్రమాణ మీ సింహాచలస్వామియే. ఆలయపు గోడలమీదను, యనేక వందల శాసనములుగలవు. శ్రీకృష్ణదేవరాయలవారి శాసనము, విష్ణువర్ధనమహారాజులైన శ్రీబెహరామహాపాత్ర శ్రీసర్వరాజమహాపాత్రులవారి శాసనములు 500 సం॥ల నాటివి కంబాలపై కానుపించుచుండును. గ్రంథవిస్తరభీతిచే విరమించితిని. విపులచరిత్రము మదీయ సింహాచల చరిత్ర గ్రంథమున చూడనగు.

వందనమందుకో విబుధవందిత పాదసరోజ! దేవ! పౌ
రందరభోగభాగ్య నికరంబులకున్ సకల ప్రపంచ స
న్మందిర వాసదాస జనమాన్యులకు న్గతినీవెకావె, ఓ
చందనలింగమధ్య విలసత్కిటిరూప! నృసింహా! మాధవా!

---

చిత్రపటముల వివరములు

1 ఉత్తర బేడాలోని కంబాలహారంగు 2 ఈశాన్య దిగ్భాగమునందలి మర్కటలతా ప్రతానము 3 త్రివిక్రమావతారము (దక్షిణభాగమున) 4 దేవాలయపు వెనుకభాగమున దృశ్యము. 5 త్రివిక్రమ ప్రాంత శిల్పము.

అంకితము:
నా రాఘవునికే!




శ్రీమతి
కిళాంబి
శేషాంబాలు

దుష్ట శిక్షణార్థంబు,
ధర్మ సంరక్షణార్థంబు,
ధరణిలో దశరథాత్మజుడై,
దగగాధేయు జన్మంబు,
దుష్టుల దెగటార్చిగాచి,
దేశిలో విరాజి తాధనువు,
ద్రుళ్లున దెగటార్చి సీత,
ధరిత్రీపుత్రి, దారగాగొన్న,
దేదీప్య ధరుండైన,
దగరాముని, ధీరుని,
దేవాది దేవ రామునిన్.
దగ్గ పూజలు సేయుగ,
దీనులమైన మేము దేవా!
దమ్ముని దారదా గ్రహించి,
దగు నిక్కుచు ద్రుళ్లుచు,
డావానర రాజునంచు,
దిక్కులు గానక ధీరుడై,
దిరుగువాలిం దెగటార్చి,
ధైర్యధీరున్, సుగ్రీవున్,
ధరణీ దారాజుగ చేసిన,
దేవా! పరంధామా!
దేవాదిదేవ రామా!
దాసులమైన మేము!
దాస్యము సేయుగ, రామా!
దుష్టుడు దానవేంద్రుడు,
దా మోసముతోడ సీత,
దొంగిలి కొనిపోయి,
ధా లంకకు ముప్పుదెచ్చిన,

దశకంధరాది రాక్షసుల,
దుష్టుల దీటడంచి,
దగసంగర రంగమందు
దైత్యమూకల పీచమడంచి
దీవెనలతో దానవపురంబందు,
దగుభక్తు విభీషణునిల్పి,
దేవినిగొన్న ధామా! రామా!
దశరథ రామా! సీతారామా!
దుష్టులమైన మేము, దేవా!
దగ సంసార సాగరంబున,
దగులొక్కని, దిక్కుంగానక,
దద్దరిద్దరీ, దెలియంగలేక,
దైన్యము నొందెడి మేము,
దా రాతి నాతిగా నొనర్చి,
దబ్బర అహల్య బ్రోచినరామా!
దుర్బలులమైన మేము,
దండమిడి నిల్చితిమయ్యా,
ధైర్యధామా! దేవాదిదేవ రామ!
నిన్ గొల్వంగా నిల్చితిమయ్యా,
రమ్మ! బ్రోవంగ రామరమ్మ!
రమ్మ రయంబుగా రామరమ్మ!
ధీర! వీర! శూరాకార!
దేవి సీత దారా కారా!
ధర్మ సత్య రక్షా కారా!
దుష్టదమన దీక్షా! కారా!
రామా! రక్షమ్మా! బ్రోవగరామా!
రమ్మా! రామా! సీతారామా!
రఘుపతి రాఘవ! రాజారామా!
రాధేశ్యామా! జానకిరామా!

# స్వర్గీయ సరోజినికి

## కవికుల గీతాంజలులు



ఓ సరోజినీ! హైందవ
సత్కార కళావిలాసినీ!

నీ దివ్యామృత వాక్కులు
ప్రాక్పశ్చిమముల సిగ్గులు

నీ కవితా మృదు వాసన
నిత్య మగుచు నిలచు నిలను!

నీ నేత్రాంచలముల వెలుఁ
గొలయు సార్వ
కరుణా సుధ
మానవ హృదయాతీతము
విబుధా దృతమమ్మా!

నీ గళమ్ము నిండారిన
ప్రేమ గీతికాలాపన
విరహ దుఃఖ వేదాంతము
వింత గతుల ద్రొక్కి విరిచి
పసివి వసంతారంభము
కోకిల గొంతువులో కలిసెను!

వంగరాష్ట్రి పుత్రికవయి
ఆంధ్రమాత కోడలివయి
వీర వనిత వయి నేటికి
దేశమాత వయి నిలతువు!

సా, చిరంజీవమ్మ.





గతియించె నొక దివ్యకమనీయ తేజంబు
కాంతా జనానంద కారణంబు
గతియించె నొక దివ్య కవితా మహత్వంబు
కల్పవల్లిక భావ శిల్పమునకు

గతియించె నొక దివ్య కార్యదీక్షాశక్తి
లోక సేవా కృతార్థైక దీప్తి

గతియించె నొక దివ్య చతుర వక్తృత్వంబు
కాణాచి రాజ్యాంగ కళలకెల్ల.

గత చరిత్రల భారత సతులరూపు
నూతనంబయి నెలకొన్నమాత, మా 'స
రోజినీ నాయుడే' భూమి నొసి నాక
భూమి కేగిన మాతెల్వి పోయినట్లె.

వికసించె నొక సరోజము
సకల జగత్సభల దివ్యసౌరభ మొసఁగగన్
సుకుమార పరిణత స్థితి
నకటా! భువి రాలిపోయె నణఁగెను దీప్తుల్.

జో. సూర్యనారాయణమూర్తి

రసిక మనోజ్ఞ నవ్య వర రమ్య కవిత్వ కళా తపస్వినీ!
యనుపమ జగజ్జన స్తుత దిగంత విరాజిత సద్యశశ్వినీ!
వసుధ సమస్త ధీవినుత భవ్యగుణా! విదుషీ శిరోమణీ!
యసువులు బాసితే; ధరణియాత్ర ముగించితె; యో సరోజినీ!

మన గురుదేవుని బోధలు వినిపింపమిలవనినుండ విసువొందవె నొకో
యనిమిషపురి నాయకఘునిఁ గనుఁగొను కౌతూహలంబు గడలు కొనెనొకో.

వంగమాతృ గర్భ వనజాలయంబున సంభవించి యాంధ్రజనని గేహ
మందు పాదముంచి యమరించితివి కీర్తి యుభయ వంశములకు నుర్విపైని.

ఏరీ మానవతుల్ ధరాతలమునం దెన్నంగ నీసాటి వి
స్తారోదార గభీర వాక్పటిమ, విద్వత్సంస్తనీ యాంచిత
స్ఫార ప్రస్ఫుట కావ్యకల్పన కళాప్రౌఢిన్, వివేకోన్నతిన్,
భూరిప్రజ్ఞ, వినీతిసంపద, సతంబున్ రాజకీయజ్ఞతన్.

ఎట్టకేలకు నీవిట కేగుదేర సారెతెచ్చు పెద్దవదినెగారి రాక
కలరు చిన్ని మరందు లట్లాంధ్రులెల్ల రధిక సంభ్రమ మొందుదురమ్మ! నిజము.

మాదు సహోదరుండు జనమాన్యుఁడు నాయుఁడు గారి పుణ్యసం
పాదిత భాగ్యరాశివని భావనసేతుము, మాకు పెద్ద ది
క్కౌదువు యిల్లు దిద్దుకొనుటందున నంచును నాససేతుమో
మైదువరాల! యీవగిది హా! హతదైవము నిన్నుఁ బాపెనే!

సర్వతో ముఖమైన యుష్మత్ప్రసిద్ధ చారువిజ్ఞాన జలధికి పారమేది?
జగతినే పాలనము సేయ జాలునీకు నొక్క రాష్ట్రాధిపత్యము లెక్కయగునె!

భారత సౌధశృంగ పరిభాసిత రత్నము కాలవాహినిం
జేరి యదృశ్యమయ్యె; రససింధువు లుప్పతిలంగ సాహితీ
భూరుహమందు నాలపనముం బొనరించు పికోత్తమంబు దు
ర్వార విధిప్రయత్నమున స్వర్గ వనాంత నివాసమున్గనెన్.

విశ్వ కవయిత్రీమతల్లీ! శాశ్వతంబగు శాంతి త్వన్మహా
దాత్మ కతుల కృపార్ద్రమతి పరమాత్ముఁ డభవుఁ డొసంగుఁ గావుత.

చింతలపూఁడి సన్యాసిరావు.

ప్రోవగు స్వేచ్ఛ సీమకు సరోజిని మెట్లులుగట్టె; ఝూంసి ల
క్ష్మీ విభవ ప్రభావమున మేరలు దాటెను ఖ్యాతిఁ గాంచె; వా
గ్దేవియె వాగ్విలాసమున; దేవియె శక్తికి; పుణ్యభూమిలో
శ్రీ విలసిల్లఁ బుట్టిన, విశిష్ట గుణాఢ్య బహూక్తు లేటికిన్.

ధీసముపేతు లెవ్వరును దీటుగ నిల్వరు; ధైర్యసంపదన్
భాసిలుః తత్త్వధన్య; రసవంతము శ్రావ్యము హ్లాద మాయుత
న్యాసపు తీవి యన్న సుగుణంబులఁ బెద్ద; పరాంబికాకృతిన్
వాసియు వన్నెయుంగనిన భారత రత్నము జారిపోయెనే?

భారతదేశ వాసులకు వంకర టింకర లేని బాటయా
ధీర గుణాఢ్య వృత్తము; సుధీమణి భారతమాత సుమ్మ; వా
గ్ధోరణి యిట్టిదట్టి దని గొప్పఁగఁజెప్పఁగనేల క్రొత్తఁగాఁ
గూరిచినేఁడు; నా పె నడుగుల్ పదముల్ సకలార్థ హేతువుల్.

పూరుషులందుఁగాని పువుబోఁడుల యందునఁ గాని
నేరుపు నందుఁగాని కమనీయపు వాక్కళ యందుఁగాని, బల్
ధీరత యందుఁగాని వెనుదీయని వారొకరైనఁ గల్గిరే?
ధారుణి యందు, మేటి యవతారమటంచు నుతించె గాంధియున్.

ఇంతటి కీర్తిశాలిని మఱింతటి ధీరగుణాఢ్య యంచు ఖం
డాంతర వాసులున్ బొగడి యాయమ వాగ్విభవోన్నత ప్రభల్
వింతగఁ గీర్తిఁ జేసి; రది పెట్టని భూషణ మామె; కట్టి శ్రీ
శాంతకుఁ గల్గుఁ గావుత సుఖ స్థితిఁ గూర్చెదు నాత్మ శాంతియున్.

వాజపేయయాజుల రామసుబ్బారాయఁడు



పుట్టితివీవు యీ భరతభూమిని పావనమొందజేయ జే
బట్టితి వాంధ్ర ముద్దులకుమారుని, లోకులుమెచ్చగాభువిన్
పట్టము లేకనే పరమపావనమైన మదింపుగాంచినా
వట్టి పరోపకారివగు అంబవు మమ్ముల వీడితే యిలన్.

సానిశెట్టి క్రిష్ణారావు.




ఉష భర్తతో చాలాసంతోషముగా కాలము గడపుచుండెను. భర్త యామెను చాల ప్రేమానురాగములతో చూచుచుండెను. ఆయన తను ఎక్కడకు వెళ్లిన యామెను గూడా వెంటతీసుకొని వెళ్లుచుండెడివాడు. ఉష యేమైన భర్తను గారడీ చేసి లోబర్చు కుందాయని చాలమంది స్త్రీలు అనుకొనేవారు. ఒకరోజు ఉష స్నేహితురాలు ఆమెను ఏమమ్మా నీభర్త నిన్ను యింత ప్రేమగా చూచుటకు కారణమేమి ? నీవేమైనా వుపాయము చేసిన నాకుకూడ చెప్పుము. నేనుకూడా అట్లు చేసెదను యని ప్రశ్నించినది. ఆమె యా ప్రశ్న విని నవ్వెను. ఇట్లు భార్యా భర్తలిరువురు సంతోషముగా కాలము గడుపుచుండిరి.

ఒకరోజు ఉష భర్తసమేతముగా హరిహరక్షేత్రము అను వుత్సవము దగ్గరకు వెళ్లెను. అక్కడనుండి షికారు కొరకు భార్యా భర్త లిరువురు ఒకచిన్న నావ నెక్కిరి. వుత్సవమునకువచ్చిన యింకా మరికొందరు నావ నెక్కుటకువచ్చిరి. కాని పల్లెవాడు వారి నెక్కించు కొనుటకు నిరాకరించెను. అందరూ పల్లెవానిమాట నిరాకరించి నావనెక్కిరి. నావ సరిగా మధ్యకు వచ్చునప్పటికి బరువు యెక్కువై వూగ నారంభించెను. అది చూచి పల్లెవాడు ప్రయాణీకు లందరకు నావ మునుగ నున్నదనియూ, మీప్రాణములను రక్షించు కొనుడనియూ చెప్పెను. అందరూ ప్రాణరక్షణకై నది యీది వొడ్డుచేరిరి.

నావమీద, ఉషయూ, ఆమె భర్తయూతప్ప మరి యెవరునులేరు. ఆమెగుండె కొట్టుకొన సాగెను. ఉషనుగురించి యేమీ ఆలోచన లేకుండా, ఆమె భర్త ఈదుకొని తన ప్రాణరక్షణకొరకు ఒడ్డుచేరెను. ఆమె ప్రాణములకు ఆశవదలుకొని భర్తతోపాటు ప్రాణములు గోల్పోవుటకు భగవంతుని ప్రార్థించసాగెను. ఆ తుదిసారి భర్తను ఆలింగనము చేసుకొనుటకు చేతులు చాచెను. కాని అంతకు పూర్వమే భర్త నావనుండి దుమికి ఒడ్డు చేరెను.

ఉష నావమీద స్పృహతప్పి పడిపోయెను. భగవంతుని దయవలన నావ తేలిక యగుటచే ఒడ్డుచేరెను. ఇదిఅంతయూ చూచుచున్నవారిలో కొంతమంది వచ్చి యామెను వొడ్డుచేర్చి ఉపచారముచేయుటకు మొదలుపెట్టిరి. తరువాత కొంత సమయమునకు యామెకు తెలివివచ్చెను. ఇది యంతయూ చూచుచున్న ఆమె భర్త పిచ్చివానివలె నిలబడిపోయెను.

ఆమెలేచి భర్తవంక చూచెను. యేమేమో ఆలోచించుచూ భర్తతో తనయింటికి వెళ్లెను. అప్పటినుండి ఆమెభర్త అవమానమును భరించలేక రోగగ్రస్థుడయ్యెను. రాను

రాను రోగమభివృద్ధియై క్షయలోనికి మారెను. డాక్టరు బ్రతుకడని చెప్పెను. ఒక రోజు ఆమెభర్త పాదములచెంత కూర్చుని యేడ్చుచుండెను. ఇంతలో పిల్లవాడు యేడ్చు శబ్దము నాలకించి పిల్లవాని దగ్గరకు వెళ్లెను. బయట భూకంపమని కేకలు వినబడెను. యిల్లుకూడా కంపించినది. అప్పుడు ఉషయొక్క భర్త ఆమెనుపిలిచి "ఉషా, నీవు పిల్లవానితోసహా నీప్రాణములను, రక్షించుకొనుము. నేను లేవలేను" యని చెప్పెను. ఉష వెంటనే పిల్లవానిని బయటచేర్చి భర్తను రక్షించుటకై లోనికివెళ్లెను. కాని వ్యర్థము. యిల్లు కూలిపోయెను. భార్యభర్త లిరువురూ ఒకరిమీద యొకరు పడి చనిపోయిరి. ఉషకు తనబిడ్డ యోగక్షేమముల గురించి భగవంతుని ప్రార్థించునంతటి వ్యవధికూడా లేకపోయెను. చూడండి; ఉష స్త్రీయైకూడా తన కర్తవ్యమును నెరవేర్చుకొనెను.

మూలం : కమలాదేవీ చౌధ్‌రాణి                    అనువాదం : యం. కస్తూరీదేవి.





**శిశువివాహనిరోధక శాసనాధిష్ఠాత**

# హర్ బిలాస్ సర్దా గారు

శ్రీయుత వంగోలు వెంకటరంగయ్యపంతులుగారు బి. ఏ., బి. యల్. (గతసంచిక శేషము)

మరియు మహమ్మదీయులొకప్రక్కయు క్రైస్తవులొకప్రక్కయు మన హైందవజనమును మతాంతరుల జేయుచున్నారు. ఇందువలన మన జనసంఖ్య క్షీణించుట ఏర్పడుచున్నది. శ్రీ దయానందులవారు శాస్త్రముల నవలోకించి మతాంతరులు హిందూమతములోనికి చేర్చుకొనబడగల సన్నివేశములజూపి వేలకు వేలుగ మతాంతరులకు మతముచే హిందూత్వముకల్పించి వారిని హిందుసంఘములో జేర్పింపగలిగిరి. ఇట్టి సంఘ సంస్కరణ సంవిధానములు మన సర్దాగారికి ఒప్పిదములయి శ్రీ దయానందులవారి పంథాను అవలంబింపజేసినవి. దయానందులవారు 1883 అక్టోబరు నెలలో అజమేరులో సిద్ధిపొందిరి. అప్పటికే వారి ఆర్య సమాజము స్థాపితమై వ్యాపించి వర్ధిల్లుచుండినది. మన సర్దాగారు 1888 లో నీ ఆర్యసమాజమునజేరి అజమేరులో నెలకొల్పబడిన సమాజమునకు ప్రెసిడెంటుగ నెన్నుకొనబడిరి. మరియు నాకాలముననె రాజపుత్రస్థానమున స్థాపింపబడిన ఆర్యసమాజములకన్నిటికి ప్రాతినిధ్యమున నేర్పరుపబడిన ప్రతినిధిసమాజమునకు ప్రెసిడెంటుగ వరింపబడిరి. మరియు శ్రీ దయానందులవారు తమజీవద్దశయందే తమ సిద్ధాంతములను పద్ధతులను ప్రచురముచేసి శాశ్వతముగ కొనసాగించుచుండుటకు రాజపుత్రస్థానము నందలి ఉదయపురమున పరోపకారిణీసభయను నన్వర్థనామమున నొకసభనుస్థాపించి సాగించుచుండిరి. తరువాత కొంతకాలమునకీసభ అజమేరుపట్టణమునకు మార్చబడి అచటనుండినది. ప్రచారములు జరిగింపసాగినది. సర్దాగారు తొలుత నీ సభలో నొక ముఖ్యసభ్యులుగనుండి దానికి సెక్రెటరి అయి అందలి కార్యముల బహుశ్లాఘ్యముగ నెరవేర్చుచున్నారు. ఆ సెక్రటరీపదవి నింకను వహించియున్నటులున్నది.

అజమేరులో స్థాపింపబడిన శ్రీ దయానందాశ్రమమున కనుబంధముగను దీనికిశాఖగను దయానంద ఆంగ్లోవర్ణాక్యులర్ పాఠశాలయొకటియు అజమేరున ప్రతిష్ఠింబడి వర్ధిల్లుచున్నది.

సర్దాగారి నిర్వాహకమున 1925 లో శ్రీ కృష్ణాంకితమగు మధురానగరమున శ్రీ దయానందులవారి నూరవ జన్మోత్సవము మహావిభవముగ జరిగించినారు. 1933 లో అజమేరునందున శ్రీ దయానందులవారు సిద్ధిబొందిన అర్ధశతవార్షిక సపర్యయు వీరియాజమాన్యముననె జరిగినది. ఆ సందర్భమున సర్దాగారు శ్రీ దయానందసరస్వతి స్మారకప్రతికృతిగ ఒక గ్రంథమునుగూడ (Commemoration Volume) ప్రకటించి దానిలో శ్రీస్వామివారి చరిత్రయు వారిచర్యలులోనగు నవతారప్రసక్తములగు విషయముల లోకమున వ్యాపింపజేసిరి.

1923 సంవత్సరాంతమున వీరు సర్కారుఉద్యోగమును వదలుకొని పింఛను బొందిరేగాని నాటి నుండియు నేటివరకనేక రాజకీయ సాంఘిక మునిసిపల్ వ్యవహారములలో పాల్గొనుచునేయున్నారు. 1924 నందు లెజిస్లేటివ్ అసెంబ్లికి అజమేర్ మార్వాడ్ పరగణాప్రతినిధిగ నెన్నుకొనబడి 1932 వరకు నందనేకయధికారములవహించి యన్నిటిని కీర్తిప్రదముగ నిర్వహించిరి. 1925 సంవత్సరమున వీరు లెజిస్లేటివ్ అసెంబ్లిలో ప్రవేశపెట్టిన శిశువివాహ నిరోధకశాసనము 1929 లో అసెంబ్లిలో అంగీకృతమై 1930 అక్టోబరు 1 తేదినుండి వ్యాప్తిలోనున్నది. ఈ శాసనమువలన వీరిపేరు ప్రతిష్ఠలు ఆసేతుహిమాచలము ఆబాలగోపాలముగ ప్రతియింటను మంగళశ్రవణ గోచరముగ స్మరింపబడుచున్నది. సతీసహగమనమును మహాక్రూరమగు ఆచారముగనుండినను అది సకృదాచరితముగ నుండుటయొకటిగాక అది ప్రత్యక్షముగ సహగమనముజేయు నా సతీమణినిమాత్రమె యంటి యుండునది. కౌసల్యాదులు సహగమనముజేసిరి. - రుక్మిణీ

సత్యభామాదులు సహగమనము జేసిరి. అందందు కొందరు వీర పతివ్రతలుండిరి. ఇట్టివారి పేళ్ల గుళ్లు, బృందావనములు వెలసియున్నవి. బళ్లారియందె శ్రీమతి వెంకటమ్మయను నొక బ్రాహ్మణేతరయువతి సహగమనము జేసి వెంకటమ్మ పేరంటాలను పేర నిత్య నైవేద్యాది ఆరాధనలతో ఆరాధింపబడుచున్నది. ఈమె పూజాదులకు గాను ఇనాములుకూడ జారిఅయియున్నవి. ఇట్టి గొప్ప స్త్రీలను పేరంటాలు అని లోకవాడుకన బిలుతురు. సహగమనము క్రూరమగు ఆచారమైనను ఒక ప్రాణితో సమాప్తమగుచుండినది. శిశువివాహమన్ననో దీని దుర్విపాకము తరతరములకు వ్యాపించియుండును. తొట్లలోనుండు బిడ్డలకు పెండ్లిండ్లు, చూడవేడుకగ నుండునేమోగాని ఉత్తరఫలము ఘోరము. ఎంతమంది బాలవితంతువులు, దిక్కులేని విధవస్త్రీలు, ఈ శిశువివాహమను దురాచారమునకు బలియగుచుండెడివారో. దేశజనాభామీద వ్యాపించియుండు ఈ దురాచారమును సహింపజాలక పరమదయాళువగు మన సర్దాగారు విశాలహృదయులై నీ శిశువివాహ నిరోధ శాసనమును ప్రవర్తింపజేసిరి.

ఈ శాసనమువలన సామాన్యజనమునోట వీరు అపదూరును బొందిరి. ప్రాచీనసాంప్రదాయములు సదాచారములు సనాతనధర్మములు అన్నియు ఒక్కపెట్టున దీనివలన ధ్వంసమైనవని ఘోషించువారు గలరు. కన్యాదానఫలము కన్యాదానస్వరూపము నాశనమైనవి యనువారుగలరు. పెండ్లికాకమునుపే కన్య రజస్వల యయిన ఆమె తలిదండ్రులును ఆమెయు సముద్రమునదూకి చావు నొందవలసియుండునని పూర్వకాలపు అవ్వలు చెప్పుచుండెడివారు. అంతియగాని యథార్థమున పూర్వమునకూడ అష్టవర్షకె కన్యాత్వముచ్యుతమగు నెడల యెంతమంది ఎనిమిదేండ్లకే పిల్లలకు పెండ్లిచేయుచువచ్చినారని యడుగవచ్చును. సనాతనధర్మముల నాలుగుకాళ్ల నడిపినవారుకూడ సాధారణముగ పది పదునొకండు పండ్రెండేండ్లలోపల పిల్లలకుపెండ్లిచేసినవారు అరిదిగనుండిరి. పెద్దమనిషి కాకమునుపే పిల్లలకు పెండ్లిచేయవలయునను కట్టుబాటుమాత్రము బ్రాహ్మణులలోనను వైశ్యులలోనను (కోమటివారు) నిర్బంధముగ నుండినట్లగుపడుచున్నది. ఈ నిర్బంధమునకు కారణము శాస్త్రీయమో సాంఘికమో చెప్పనలవికాదు. శిశువివాహ నిరోధకశాసనము అమలులోనికి వచ్చినవెంబడి వెంబడి కొన్నిదినములు శాసనమును తిట్టువారు, "శారదాఆక్టు" అని నిందించువారు, రహస్యముగపెండ్లిండ్లు చేయువారు పుదుచ్చేరికి, మైసూరుపల్లెలకు హైదరాబాదుగూడాలకుపోయి మేలతాళములుకూడ లేకుండ కన్యాదానసిద్ధికి లోపములేకుండా మాంగల్యధారణము జరిగించినామని ప్రగల్భముల జెప్పుకొనువారందందు యుండిరి. పుదుచ్చేరి, మైసూరు, నిజామురాష్ట్రములు కన్నులు తెరచుకొనినతర్వాత రహస్యవివాహ ప్రథ శ్రవణగోచరము కావడము తగ్గిపోయినది. ఇప్పుడు పిల్ల పెద్దదిఅగునేమో మనువువిచారింపకపోయిన ఏమి హత్యచేసికొనవలయునో ఏమిపాపము మెడకట్టుకొనవలయునో యనుమాట చెవిబడుట తగ్గిపోయినది. పిల్లకింకను పెండ్లికాకపోయెనేయని విచారపడు తల్లులు తగ్గిపోవుచున్నారు. పిల్ల ఇంటర్ పరీక్షనిచ్చినగదా బి. ఏ అయినగదా యను విచారమె వినబడుచున్నది. ఇంతకును ఈ సర్దాశాసనము దేశమునకు వరమా,శాపమా? శాపరూపవరమా ? వరరూపశాపమా ? య్యని పరిశీలించినయెడల శాపమనువారుకూడ శాపరూపవరమేనని యంగీకరింపవలసియుందురు. వీరు గొప్ప దేశాభిమానులు. ఈవిషయము వీరువ్రాసిన హిందూసర్వోన్నత్యమను గ్రంథమున ఘోషింపబడియున్నది. శిశువివాహము గుణభూయిష్టమైనదగునెడల . సర్వవిషయముల హిందూ ప్రాశస్త్యమును ప్రకటించినవీరు శిశువివాహము పనికిరాదని సిద్ధాంతముజేయజూతురా ? ఇది లోపభూయిష్టమై యుండినందుననె దాని నిరోధనివారణముల బూనిరి అనియు గ్రహించనగును.

(సశేషము)

# అంతిమ గేయం

అమర జ్యోతిలా ఆకాశాన
    అందమైన ఆటలాడే ఓ తారా!
చీకటి రాత్రిలో
    చిందులు త్రొక్కే ఓ తారా!
        నీలాగే నేనుకూడా—
    నిమీలిత నేత్రాలతో,
    నిద్రారహిత నిరీక్షణతో,
    ప్రకృతి ప్రశాంతతతో,
చలనహీనమైన చెలియలికట్టను
    చలింపబూనే చంచల జలనిధిలా,
కొండపై మంచులా,
    ఒడ్డుపై నాచులా,
చక్కగ చిందిన సువాసనగంధంలా,
    ంకా ఇంకా చలింపకుండా
        నీలాగే నేనుకూడా—

నాప్రియురాలి కఠిన వక్షస్థలి తలగడ కాగా,
నాప్రియురాలి వక్షస్థలిపై
ఆమె ఉచ్ఛ్వాస నిశ్వాసాల హెచ్చుతగ్గుల
    ననుభవిస్తూ,

జీవితమంతా

    ఒక మధుర బాధలో,
    నా ప్రియురాలు పీల్చే
    ఊపిరి శబ్దంలో
    గడిపేస్తా

లేకపోతే

    మరణంవరకూ
    మూర్ఛిల్లుతా!

మూలం: కీట్సు

అనువాదం: చల్లా రాధాకృష్ణమూర్తి.

# సామెతలు

489. తాచెడ్డకోతి వనమెల్ల చెఱచినట్లు.
490. తేలేనయ్యకు తెంపులు మెండు. తినలేనమ్మకు తీపులు మెండు. పెట్టలేనమ్మకు బెక్కులు మెండు.
491. తిననేర్చినమ్మ పెట్టనేరదు.
492. తురకలులేనివూళ్లో దూదేకులవాడేసాహేబు.
493. తలపాగ చుట్టలేక బుర్ర వంకరన్నాడట.
494. తెలుగే తెలేదు; సంస్కృతంబు తెన్నే మెరుగుణా.
495. తిన్నమ్మకు తిన్నంతవాపు; కన్నమ్మకు కన్నంత వాపు.
496. పనిలేనిమంగలి పిల్లితల గొరిగాడు.
497. పరులతల్లి పెట్టు పంచపరమాన్నములకన్న, కన్నతల్లిపోయు గంజి మేలు.
498. పనివాడు పందిరివేస్తే పిచ్చుక ఊడగొట్టినది.
499. పిండికొద్ది రొట్టె.
500. పాతగుడ్డ కుట్టు నూలు చేటు.
501. పదిమందితోపాటు చావుకూడ పెండ్లివంటిదే.
502. పంచపాండవులంటే మంచంకోళ్ళలాగా ముగ్గురని రెండువ్రేళ్లు చూపిబోయి ఒక్కవ్రేలితో క్రింద గీతగీచినాడట.
503. పొదలోని పక్షులన్నింటిని చూచి, చేతిలోని దానిని విడిచినట్లు.
504. పరుగెత్తి పాలుత్రాగేదానికన్న, నిలిచి నీళ్లు త్రాగమన్నారు.
505. పిడుగునకు బియ్యానికి ఒకేమంత్రము.
506. పద్మరాగముల గనిలో గాజుపెంకులుండునా?
507. పెండ్లిపందడిలో బొట్టుకట్టమన్నాడట.
508. బ్రతుకు తక్కువ. బడాయి యెక్కువ.
509. బావా! నీ భార్య ముండమోసిందంటే మొర్రోయని యేడ్చినాడట.
510. ముక్కుచిన్నది ముత్యంపెద్దది.
511. ముందున్నది ముసళ్లపండుగ.
512. మెత్తనివాళ్ళను చూస్తే మొత్తబుద్ధి.
513. రాజుకన్న చిన్న మంత్రికన్న పెద్ద అన్నట్లున్నది.
514. రోగము రట్టు, సంసారము గుట్టు.
515. రంకు నేర్చినమ్మ, బొంకు నేర్చిందట.
516. లోపల లొటారమయిన పైకి బటారము.
517. లోభికి రెండువిధాల నష్టములు.
518. స్వర్గానికివెళ్లినా సవతిపోరు తప్పదు.
519. సోలెడుబియ్యానికి టెక్కులావు, తక్కువ జాతికి నిక్కులావు.
520. అంగట్లో బెల్లము గుళ్లో లింగానికి నైవేద్యము.
521. అంటూ సంటూ ఆచారివానిది, రట్టూ రవ్వా గంగానమ్మది.
522. అంతమాత్రం వుంటే, దొంతులతో కాపరం చెయ్యనా?
523. అందని మానిపండ్లకు, ఆశపడ్డట్లు.
524. అంధునకు అద్దము చూపినట్లు.
525. అగ్గువ అయితే అంగడికి వస్తుంది.
526. అత్తచచ్చిన ఆరుమాసములకు, కోడలికి కంట్లో నీరువచ్చినదట.
527. అత్తచేసిన పనులకు, ఆరళ్లులేవు.
528. అత్తవారింటిసుఖము, మోచేతి దెబ్బవంటిది.
529. అదంత్రునికి ఆశపెట్టరాదు, బలవంతునికి చోటుయివ్వరాదు.
530. అదే పతకమైతే, మనము బ్రతకమా?
531. అద్దముమీద పెసరగింజ పడ్డట్లు.
532. ఆకాశానికి నిచ్చెన వేసేవాడు.
533. ఆకలియెత్తుతుంది అత్తగారూ అంటే, రోకలి మ్రింగవే కోడలా అన్నదట.
534. ఆకాశవర్తకుడు.
535. ఆచారానికి అంతములేదు, అనాచారానికి ఆదీలేదు.
536. ఆటాతీర, పాటాతీర, కోటలో రామరాజ్యము.
537. ఆడేకాలూ, పాడేనోరూ, ఊరకుండదు.
538. ఆ తుష్టికీ, యీ నష్టికీ సరి.
539. ఆదాయములేకనే శెట్టి వరదబోడు.
540 ఆపతిమెక్కులు, సంపతికుట్లు.
541. ఆమంట ఈమంట, బ్రాహ్మణార్థం కడుపుమంట.
542. ఆమడలుదూరమైతే, అంతఃకరణలు దూరమా?
543. ఇంగువ కట్టిన గుడ్డ.





# 1949—ఫోర్డుకారు

ఫోర్డు మోటారు కంపెనీవారు క్రొత్తగా తయారుచేసిన మోటారుకారునకు "ఫోర్డు ఫార్టీనైనర్" (1949 ఫోర్డుకారు) అని పేరుపెట్టిరి. ఈ మార్చి 29 వ తేదిన మద్రాసునగరమందలి పత్రికాప్రతినిధులందరి నాహ్వానించి వివరముగా నీ కారు వివిధభాగములచూపి వివరించి ఆయా వాని విశేషముల వర్ణించిరి. ఇది చాలా దృఢముగా నిర్మింపబడినది. ఈక్రొత్తఇంజను గాలను పెట్రోలునకు ఇదివరకుకన్నా 10% హెచ్చు మైళ్లు నడచునట. ఇంజను కొంచము ముందుకు అమర్చబడినందున వెనుక జాగా వృద్ధిఅయినది. కూర్చుండు స్థలము 57.60 అంగుళముల వెడల్పున సౌకర్యముగానున్నది. డ్రైవరున్నూ, ఇతరులున్నూ కూర్చుండుసీట్లు ముందువెనుక చక్రములమధ్య నమర్చబడినవి కావున ఏలాటి అదటులేకుండ ప్రయాణము చేయవచ్చును. తలుపుగడియలు వాటంతటవి తిరిగి తెరపుడు పడకుండ అమర్చబడినవి. వెనుకతలుపు మూయునప్పుడు యాదాలాపముగ కూర్చున్నవారివేళ్లు నలుగుట సామాన్యము. సీటు ముందుకు అమర్చబడియున్నదిగావున ఇప్పుడట్టిది జరుగుట అసంభవము. డ్రైవరుసీటు, పొట్టివారికి పొడుగువారికి, లావుపాటివారికి, సన్నివారికి తగినట్లుగా సర్దుబాటుచేయుట కనువుకల్పింపబడియున్నది. ఇదివరలో వేగము మున్నగువివరముల సూచికలు వరుసగా నమర్చబడియుండుటచె డ్రైవరు మెడసాచి చూడవలసియుండెడిది. ఇప్పుడట్లుగాక అన్నియు కంటికెదురురుగా చక్రాకారమున నమర్చబడినవి. నేడు యువతులును కారునడుపుట కలవాటుబడ్డారు. కావున ఈ ఏర్పాట్లను తప్పక హర్షింతురు. అన్నింటికన్నమించిన విశేషమింకొక్కటున్నది. పుష్పకవిమానమైనను గృహిణితోకూడ ప్రయాణమైతే సామానుసర్దుటకు స్థలసంకోచమే. ఆ కొరతతీర్చుటకై - ఈ కారువెనుక ప్రక్క నేర్పరిచినడెక్కును ఒకచిన్న భోషాణ మనిపించునట్లు అమర్చినారు. ఇదివరకన్న 57% హెచ్చు జాగానేర్పరచినారు. "గృహలక్ష్మి"కిది ఎంతో సంతోషదాయకమైనవిషయము. ఇదివరలో ఇందే లోపైపున విడిచక్రమును అమర్చియుండేవారు. అందుచే దారిలో చక్రముచెడిన రోడ్డుపై లోపలిసామానెల్ల దించి చక్రము తీయవలసియుండేది. ఇప్పుడట్లుగాక ముందే ఒక తట్టుగా నీచక్రమునమర్చిరి గాన చేరదలచుకొన్న చోటికి చేరేవరకు సామాను కదల్చవలసిన అవసరముండదు. నిజంగా ఇదివరలో - తనకాప్యాయమైన ప్రక్కలు, పెట్టెలు నడిరోడ్డులో దుమ్ములో పరచిపెట్టవలసిరావడం "గృహలక్ష్మి" కెంతో చికాకుగా ఉండేది. ఇప్పుడది తప్పిపోయినది. ఇందలి వివిధభాగములు అమెరికాలో తయారై ఈ దేశమునకు దిగుమతికాగా భారతీయులే వీనినెల్ల ఇచ్చట కర్మాగారమున అమర్చి కారుతయారుచేయుదురట. అందుకు అవసరమైనంత వరకు సాంకేతికజ్ఞానము వారి కలవడుచున్నది. ఈ వివరణమంతయు ఐనమీదట 'కనామారాహోటల్' లో వీరందరికి విందుచేశారు. ఈ విందారగించిన భోక్తలు చాలావరకు భారతీయులు, శాకాహారులు అయినా శాకపాకములు మాత్రము పాశ్చాత్యపద్ధతినున్నవి; ఇట్టివిందులు శుద్ధదేశవాళీగా నుండవలయు ననము; కాని సామాన్యముగా భారతీయగృహములలో చేసుకొనే శాకపాకములు, భక్ష్య, భోజ్య, చోష్య, లేహ్య, పానీయముల నేకములు మెళకువగా, నాగరికముగా బల్లలపైతిన వీలైనవిగానున్నవి; వాని నవలంబింపవచ్చును.



## దాసీయంత్రమా? యంత్రపుదాసీయా?

లండనులో 2 సం|| లు కష్టపడి ఒక యాంత్రికుడు క్రొత్తమిషను కనిపెట్టాడు. ఈ మిషనుతో బూడ్సులు తుడువవచ్చు; అంట్లుతోమి కడగవచ్చు; కత్తి సానపెట్టవచ్చు. ఈయంత్రం 18 అం||లపొడవు; 12 అం|| ల వెడల్పు; 6 అం|| ల ఎత్తు. విద్యుచ్ఛక్తిమూలాన దీనితో పనిచేయించ వీలగును. 14 పౌ లు మాత్రమే దీని బరువు. లండను వస్తుప్రదర్శనశాలలో దీనినుంచారు. కొద్దికాలంలో దీనిని వేలకొలదిగా తయారుచేయను ప్రయత్నిస్తున్నాడు. దీనికి దాసీపనిచేసే యంత్రము అని పేరుపెట్టారు.

# గృహలక్ష్మీ!

కోవిద, విద్యాప్రవీణ భ. సీతారామమూర్తిగారు.

చిన్నవయసున నిన్నుఁజేబట్టు తరి నాడు బొమ్మలం బాటల నెమ్మిఁగ్రమ్మ
బలపంబు చేఁగొని బడికేగువయసున ముద్దులొల్కెడుకథల్ మోజుగొల్ప
నవయౌవనము సూప పవలు రేలునుఁ జని నీదు కవితా స్వాద మోద రుచిని
ప్రౌఢతనమున నేడు వేడుకల్ కల్గు నీ యనుభవోపన్యాస ఘనతకలన

తోడివారికి చక్కని త్రోవజూపి సభ్య తన్నితిపీడక సరసమతిని
ఆంధ్రజాతీయులక్ష్మితా నలరెననగ మాన్యవైతివి గృహలక్ష్మి ధన్యవీవు.

పాటలన్ మాటల బ్రమసి పిన్నలు నీవుకనుపించ నెదురేగి గంతులిడరొ?
చదివెడువారు దాచక వారికై వలయు విద్దెనేర్పుటఁ గనుల నద్దికొనరొ?
సరసకథాపద్య సాహితీ చర్చలఁ జదువ నిన్గోరరొ జాణలంత?
నైతిక రాజకీయైతిహాసిక సాంఘిక విశేషముల నేర్ప గలవు కాన

విందుకాదొక్కొ నీరాక నందఱికిని? తగుచికిత్సలఁదెల్పెడు దానవగుట
తల్లులిడరొకో ధన్యవాదములు నీకు; ఆహా! గృహలక్ష్మి పేర్వడి యలరినావు.

గృహలక్ష్మి నీవలనన్ గ్రహియింపం దగినవెన్నొ గలవు తలంపన్
అహరహము నీదుకృతులచె మహిళలకున్ సంఘమందు మాన్యత కలిగెన్.



# ప్రశ్న

గీ॥ తగ్గువారుల నెమకుచు తరళయగుచు
ధరణి నున్మార్గగామియౌ తండ్రిజంపి

మగని తలకెక్కి యాడెడి తగవులాడి
నరసి కొనియాడి మొక్కుదు రార్యులెపుడు

పరమపావని యని దీని భావమేమి
తెలియజెప్పదె "గృహలక్ష్మి" తేటపడగ?

# వెలెకారి—(దాసీకన్య)

జమీందారు వేదాచలముదలియారు కుమారుడైన మూర్తి దాసీకన్యను ప్రేమించడం ఈకథకు మూలం, ఆజమీందారుచే కష్టాలుపడలేక ఊరిపోసుకొని చచ్చిన సుందరంపిళ్లెకుమారుడు ఆనంద్ జమీందారు మీద పగతీర్చుకోవాలని ప్రతిజ్ఞచేయడం అందుకు ప్రయత్నించడం ఈ కథను పెంచుతాయి. కథమధ్యలో ఆనంద్ దొంగవేషంతో జమీందారుకూతుర్ని పెండ్లాడుతాడు; ఇందుకు మాయలమారి మణి సహాయం. అల్లుడు. జమీందారుఇల్లు గుల్లచేసి, అతనికూతుర్ని పూరింట్లో కాపురంపెట్టి వీధుల వెంట కూరగాయలమ్మించి, మూర్తికి అమృతానికి (దాసీ) గలప్రేమ గాథబయటపెట్టి ఆతనిని ఇంటినుండి తరిమించేసి-నానావిధాలా జమీందారుమీద పగతీర్చుకొని తండ్రిఋణం తీర్చుకుంటాడు. మూర్తి దాసీకన్యను వెతుక్కుంటూవచ్చి వారిల్లు కాలిపోగా విరహోన్మాదాన తిరిగి తిరిగి దొంగసన్యాసిని చంపి హంతకు దక్కుతాడు. ఆఖరుకు- కథ సుఖాంతమా? దుఃఖాంతమా?—డబ్బులు చెల్లించి వెండితెరపై చూడనిదే తెలుస్తుందా?


యం. యన్. నంబియార్, శ్రీ పి. కె. సరస్వతి




మద్రాసు వై. యం. సి. ఏ వారు అనాధబాలురకు ఒక శరణాలయం నడుపుచున్నారు. దానికి గతమాసాంతమున శ్రీ శ్రీ శ్రీ భావనగరం మహారాణీవారిచే "బాలురపట్నం" అని— నామకరణం చేయించారు. ఆసందర్భములో ఆమె పల్కిన శుభవాక్యములు:-

వై. యం. సి. ఏ సరియైన మార్గంపట్టినది. తాముచేయని అపరాధములకే వీరు అనాధబాలురైనది. అందుచేతనే తమ సాంఘికస్థితిగతుల నభివృద్ధిపరచుకొను అవకాశం లేనివారైనారు. అట్టివారికీసంస్థ వరప్రసాదము. ఈ రాష్ట్రంలో ఇతర పట్నాలలోను ఇట్టి సంస్థలేర్పడి అనాధబాలురను కాపాడునని ఆశిస్తున్నాను. ఇతరులతోపాటు సరిసమానమైన అవకాశాలిస్తే. ఈ అనాధబాలురున్ను ఉత్తమపౌరులు కాగలరు. ఒక దేశము యొక్క ఆర్థికాభివృద్ధి, భవిష్యత్పురోభివృద్ధి ఆదేశంలో ఏవిధమైనపౌరులు తర్ఫీదు లవుతున్నారా అనే దానిమీద ఆధారపడిఉంటవి. కాబట్టి ఈ అనాధబాలురకు సరియైనశిక్షణ కవకాశాలు కల్పించి, వీరిని తిరిగీ సంఘంలో అర్హస్థానమున చేర్చుకోవడం సంఘంయొక్క భారం."

జవహరిలాల్ నెహ్రూ బీహారురాష్ట్ర మహాసభలో నిట్లుపన్యసించిరి:

స్త్రీలను పురుషులతోపాటు అడుగుకలిపి నడిస్తేగాని దేశముఅభివృద్ధికి రాజాలదు, ఎక్కడనో అగ్ని ప్రమాదమనగానే భయపడి ఆడవాళ్లంతా లేచి తొక్కిసలాడారు. విదేశాంగవ్యవహారాలలో పని చేయను ఉద్యోగులను నియమించేటప్పుడు, వారిభార్యల విద్యావైదుష్యాలు, శక్తిసామర్థ్యాలు ఆలోచింపబడుచున్నవి. ఏమంటే అట్టి ఉద్యోగులువెళ్లే దేశాలలోగల స్త్రీలతో వారిభార్యలు కలిసిమెలిసి తిరుగగల చదువు చాతుర్యములు వారి కుండాలి.

రెండవ అఖిలభారత శిశువిద్యామహాసభ రాజాజీహాలులో సమావేశమైనది. ఆసభా ప్రారంభోత్సవంచేస్తూ శ్రీ శ్రీ శ్రీ భావనగరం మహారాణీగారిట్లుపన్యసించారు:—

భారతదేశపు భవిష్యత్తు రాగల సంతతివారిమీద ఆధారపడియున్నది; కాబట్టి శిశువిద్యా విధానికి మార్గాంతరములు, సాధనాంతరములు అన్వేషించాలి; మేలైన పౌరులుగా, వివేచనాపరులుగా, పరిపాలకులుగా వారిని తయారుచేయాలి. శిశువుయొక్క మనస్తత్వము, భిన్నమైన అభిరుచులు అనేవానిపైన ఆ శిశువుకేవిధమైన విద్య అనునది ఆధారపడి ఉంటుంది. కొన్ని శాస్త్రయుక్తమైన పరీక్షలచేత తెలివి కొల్చే సాధనమును అమెరికావంటి విదేశాలలో కనిపెట్టియున్నారు. ఈ పరీక్షలద్వారా బిడ్డకుగల శక్తి సామర్థ్యాలను, స్వతస్సిద్ధమైన స్వభావాలను కొంచమించుగా విలువకట్టి తెలుసుకొని, ఆ బిడ్డలకు వారి అభిరుచుల ననుసరించి విద్యాబుద్ధులనేర్పి తర్ఫీదు నివ్వగలుగుచున్నారు. ఇక్కడ మనదేశంలో ప్రస్తుతం బిడ్డలకు చదువుచెప్పే విధానం సరియైనదిగాదు; ఏమంటే, బిడ్డయొక్క నైజంలో ఎట్టిశక్తి సామర్థ్యాలు అవకాశాలు అణగియున్నవా, అని కనుక్కోడములేదు; అందుకు తగిన అనుకూలాలు కల్పించడమూలేదు. యాదాలాపంగాను యాదృచ్ఛికంగాను మాత్రమే ఏకొలదిమంది బిడ్డలో సరియైన విద్వత్తునార్జించి రాణించుచున్నారు. మిగతవారు సరిపడని పరిస్థితులలో తగుల్కొని యుంటున్నారు."

శ్రీమతి రేణుకారాయిగారు కాన్‌స్టిట్యుయెంట్ అసెంబ్లీలో సభ్యురాలు. అ. భా. మ. మహాసభ కుపాధ్యక్షురాలు. యునైటెడ్ నేషన్స్ సభకు భారతీయ ప్రతినిధిగా వెళ్లుచున్నారు. దారిమధ్యమున లండనులో దిగి పత్రికలవారితో భారతీయ మహిళోద్యమమునుగూర్చి ఇట్లు చెప్పినారు:—

భారతదేశంలో పురుషులు నిజంగా వారి స్త్రీలు స్వతంత్రులు కావాలని కోరుచున్నారు. నూతన భారతజాతి నిర్మాణంలో స్త్రీలు సంపూర్ణంగా కృషిచేయాలని వారి పురుషుల అభిలాష. అందుచేతనే మేము సహజమార్గాన్నే స్వాతంత్ర్యం సంపాదిస్తున్నాము; యూరపులోను అమెరికాలోను ఈవిషయంలో స్త్రీలుపడ్డ రభస మేమెరుగము. మా జాతీయ ప్రభుత్వము, రాజకీయనాయకులు ఎన్ని ఇతరపనులున్నా, మా ఉద్యమముఎడల సానుతాపం చూపుతూనేయున్నారు. వివాహములు, వారసత్వము మున్నగు వానికి సంబంధించిన చట్టాలను స్త్రీలకనుకూలంగా సవరించి, ఎన్నికలకుముందే సౌకర్యం కలుగచేయాలని వారి అత్రం. మేము ఇతరదేశాలస్త్రీలకు నకళ్లుగా తయారవుతున్నామని అనుకోకండి. మేము పొందవలసిన ఔన్నత్యాన్నిగూర్చి మాకు స్వతస్సిద్ధంగానే మాది అనే దృక్పథమొకటి ఉన్నది. మా సంఘసంస్కర్తలు, ముఖ్యంగా మహాత్మాగాంధీగారు స్త్రీపురుష వర్గాలమధ్యఉండే విభేదాలు నిర్మూలించి - ఇతరదేశాలలో ఇందుకై జరిగిన పోరాటాలకు అవసరంలేకుండా చేశారు. ఈరోజులలో స్త్రీలు ఏ వృత్తియైనా చేయవచ్చు; అన్ని ఆటంకాలు తొలిగించారు; అన్నిటా తర్ఫీదు నిస్తున్నారు. ఈ రోజున భారతీయ స్త్రీలు ఎంతో చురుకుగా ఉన్నారు. వేలకొలది కాందిశీకుల విషయమై వారు చేసిన కృషియే అందుకు తార్కాణము.

మనజనాభా వృద్ధియగుచున్నదనియు, మనఆర్థికసంపద వారినిపోషింపజాలదనియు మనమును పాశ్చాత్యదేశములవలె సంతాననిరోధము నవలంబింపవలయుననియు చెప్పువారు పలువురు పురుషులేగాక స్త్రీలునుగలరు. ఈవిషయమై భారతయూనియన్ ఆర్థిక మంత్రి జాన్‌మత్తయిగారిట్లు ఆయవ్యయముల చర్చసందర్భమున చెప్పినారు:

వ్యక్తులెవరైనను వివేకముతో నీ సంతాననిరోధవిధానము నవలంబింపవచ్చును. కాని కృత్రిమసాధనములలో నీసంతాననిరోధము సాగించుటయన్నది ఆలోచనకువచ్చినప్పుడు తీవ్రమైనసమస్య ఎదుర్కొనుచున్నది. బాహుళ్యముమీద నీవిధానమవలంబించుచో - ఒక కాలానికి, దేశానికిగల బాధ్యతలనన్నిటిని నిర్వహించుటకు తగినంత జనాభా లభించకుండా కొరవగలుగుతుంది. దేశంలోగల వసతులన్నిటిని చక్కగా ఉపయోగించుకొని ఆర్థికంగా అభివృద్ధిపరిస్తే; వచ్చేతరంలో లేక ఆపైతరంలో దేశంలోగల హెచ్చుజనాభా బరువు కాదుగదా అదియొక నిక్షేపంగా మారుతుంది.

వెనుక చెన్నరాజధాని గవర్నర్ సర్ ఆర్చిబాల్డునై ప్రస్తుతం ఢిల్లీలో బ్రిటిష్ హై కమిషనర్‌గా నున్నారు. నైసతి ఇట్లని రేడియోలో ప్రసంగించినది:

“ప్రపంచంలో ఏదేశమైనా ఈర్ష్యచెందగల్గునట్లుగా గొప్ప నాయకులు భారతదేశంలోనే పుట్టియున్నారు. భారతదేశం ఇంకా అభివృద్ధిచెందుతుంది. ప్రపంచంలో గొప్పదేశాలలో నొకటిగా తన అర్హస్థానము నది అలంకరిస్తుంది. నేను బ్రిటిష్‌జాతికి చెందినదాని నైనా, నేనెల్లప్పుడూ జన్మచేత పంజాబీనని, దత్తతచే మద్రాసీనని ఢిల్లీకి ఆకర్షింపబడ్డానని తలుస్తాను.”



# శ్రీ విరోధి సంవత్సర విశేషములు

స్వస్తిశ్రీ చాంద్రమాన విరోధినామ సంవత్సరం ఈ 30-3-49 తో ప్రారంభమైనది. ఈనాటికి సృష్టి ప్రారంభమై 195,58,85,050 సం॥ లైనదట. కలియుగ మారంభమై 5050 సం॥ లట.

విరోధి సం॥నికి గ్రహ కూటమి లో క్రొత్త పాలకవర్గము.

| | |
|---|---|
| రాజు | బుధుడు |
| మంత్రి | బుధుడు |
| సేనాధిపతి | కుజుడు |
| సస్యాధిపతి | శని |
| ధాన్యాధిపతి | గురువు |
| అర్ఘాధిపతి | కుజుడు |
| మేఘాధిపతి | కుజుడు |
| రసాధిపతి | చంద్రుడు |
| నీరసాధిపతి | శని |
| పశుపాలకుడు | బలరాముడు |
| స్థానసంరక్షకుడు | శ్రీకృష్ణుడు |

రాజు మంత్రి ఒకడే కావడంవల్ల ప్రపంచ వ్యవహారాలు 'స్వయం రాజా స్వయం మంత్రి,'గా జరుగుతాయి. పరిపాలకుల కుపద్రవము ; యుద్ధము. అంటే ప్రజలకు ఉపద్రవము; దుర్భిక్షము. కుజుడు సేనాధిపతి కావడంచేత అడవులు తగులపడతాయి; మాచారు గడా సూరతువద్ద 800 చ॥మై అడవులు తగుల పడుతున్నాయి. భద్రాచలంవద్ద అడవులంటుకున్నాయి. సస్యాధిపతి శని - నువ్వులు, మినుములు వగైరా నల్లధాన్యం హెచ్చుగా పండుతవి. ఇంకేమి; ఇడ్డెనలు, గారెలు విస్తారముగా చేసుకొని తినవచ్చు. ధాన్యాధిపతి గురువు కాబట్టి వానలు కురవడం; పంటలు పండడం; పాడి వృద్ధి. అయితే చెన్నపట్నంవంటి పట్నాలలో పాలపొడి కలపకుండా పాలుపోస్తారా ? అర్ఘాదిపతి కుజుడు ; వానలు తక్కువ; పంటలు తక్కువ. మేఘాదిపతి అతడేకదా. దాని ఫలితమున్నూ అయితే కందులు మొదలైన ఎర్రపంటలకు వృద్ధి. చంద్రుని రసాధిపత్యముచేత నువ్వులు, నూనె, బెల్లం, కారం, పాలు, పెరుగు, చక్కెర అన్నీ ప్రియము శని నీరసాధిపతి కావున కొమ్ములు, రాళ్లు, మాంసం, కొయ్య, లోహపాత్రలు చౌక. దుస్తువులు, రాళ్లవస్తువులు రాచ్చిప్పలు, సత్తెప్పాలలు మూకెముంతలు చౌకగా కొనవచ్చు. పశునాయకుడు బలరాముడు గావున పశువృద్ధి ; అయితే నేమి - రసాధిపతి చంద్రుడు ఆ లాభంకూడ తీస్తాడు.

మూఢమి: చైత్ర శుద్ధ పాడ్యమి మొ॥ వైశాఖ బ॥ పంచమివరకు, మాఖ శుద్ధ ద్వాదశి మొదలు మాఖ బ॥పంచమివరకు శుక్రమూఢమి. మాఖ శుద్ధ విదియ మొదలు ఫాల్గుణ శుద్ధ విదియవరకు గురుమూఢమి.

కర్తెర : వైశాఖ శుద్ధపంచమి మొ॥ జ్యేష్ఠ శుద్ధ పాడ్యమివరకు కర్తెర.

ఆశ్వీయుజ శుద్ధ దశమీ శనివారం తుంగభద్రానదీ పుష్కరారంభం.

సంక్రాంతి పుష్యబ॥దశమి శుక్రవారంరాత్రి 4-వ ఝామున మకర సంక్రాంతి. అందుచేత మర్నాడు తెల్లవారే పుణ్యకాలం. ప్రొద్దునే తర్పణాలు వదలి గుమ్మడికాయ దానం చేసుకొని పెందరాడే భోంచేయవచ్చు. సంక్రాంతి పురుషుడికి మూడుతలలట; రెండు ముఖాలు, 5 నోళ్లు; 3 కళ్లు; ఎనిమిది చేతులునట. నల్లగా వికారంగా స్త్రీపురుష రూపాలు కలిసి ఉంటుందట, ఇతడొక చిత్రపురుషుడు. ఆయన కస్తూరీగంధం పూసుకుంటాడట - మనకు దుర్భిక్షం, రాజపీడ ; చిరునవ్వు నవ్వుతాడట - మన కశుభమట; తూర్పుదిక్కు పోతాడట - ఆ దిక్కున కలవులు, ఈతిబాధలు.

కందాయ ఫలాలులు :

కృత్తిక, పుబ్బ, మూల, రేవతివార్లకు ఆది శూన్యం ; కృత్తిక, అరుద్ర, ఆశ్లేష, ఉత్తర, స్వాతి, జ్యేష్ఠ, ఉత్తరాషాఢ, శతభిషం, రేవతివార్లకు మధ్య శూన్యం; అశ్వని, ఆరుద్ర, పుబ్బ, విశాఖ, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్రలవారికి అంత్యశూన్యం.

కార్తెలు

రోహిణీకార్తె మే 24 మొ. జూన్ 6 వరకు. చిత్తాస్వాతి కార్తె అక్టోబరు 10 మొ॥ నవంబరు 4 వరకు. వర్షాలు సస్యానుకూలంగా కొట్టి కురవకపోయినా, కట్టెలు మండకుండా, గుడ్డలారకుండా, ఏదీ ఎండబెట్టుకోడానికి వీలులేకుండా మాత్రం కురుస్తాయి. అనూరాధకార్తె నవంబరు 19 మొ॥ డిశంబరు 1 వరకు. ఈ కార్తెవానలో తడిస్తే ఆడవాళ్లు మొగవాళ్లు, మొగవాళ్లు ఆడవాళ్లు అవుతారని భట్టీవిక్రమార్కులకథలలో చెప్తారు. కాబట్టి జాగ్రత్తఅవసరం - అందులోను సువృష్టి అని చెప్పియున్నాను.

# కళాకేంద్రంవారి నాటకప్రదర్శనాలు

శ్రీ శ్రీ శ్రీ పిఠాపురం మహారాజావారు అధ్యక్షులుగా, శ్రీ స్థానం నరసింహారావుగారు ఉపాధ్యక్షులుగా శ్రీ గిడుగు సీతాపతి, రామాచారిగార్లు (నటన సంపాదకులు) చక్రరక్షకులుగా-కళల సమర్థింప నేర్పడినది కళాకేంద్రం. కళలన్నిటికి అంతర్యామినగల అనన్యత్వము నిరూపించుట; వ్యక్తికి, దేశానికి, మతధర్మానికి, అంతర్జాతీయతకు కళారాధన పురోభివృద్ధికరమనే విషయం అంగీకారమయ్యేట్లు కృషి చేయడం, ఈ ఉద్దేశములు నెరవేరుటకు కావలసిన పనులన్నీ చేయుట; అనువానిని ఈ కళాకేంద్రం ముఖ్య కార్యక్రమంగా పెట్టుకున్నదని వారి కరపత్రమున ప్రకటింపబడినది. అందు ముఖ్యంగా నాట్య, నాటక కళల నటులను ఒద్దికల దిద్ది తీరుస్తారట.

ఇట్లా ఏర్పడిన కళాకేంద్రానికి ప్రారంభోత్సవంగాను, ధనసంపాద్యంగాను - 'ఉత్తమ నటులతో' నాటక ప్రదర్శనా లేర్పాటు చేయబడినవి. ఈ ప్రదర్శనాలు ఈ నెల 9 వ తేదీన - చెన్నపట్నంలో మ్యూజియంనందలిథియేటర్ హాలులో శ్రీ శ్రీ పిఠాపురంమహారాజావారిఅధ్యక్షతక్రింద ప్రారంభమైనవి. ప్రదర్శన నిర్వాహకులు చక్కని ఏర్పాట్లుచేశారు. హాలుకూడా అందుకు తగినట్లు సౌకర్యంగాఉన్నది.

9 వ తేదినాడు - 'పేదపిల్ల' అనే నాటకాన్ని పాలకొల్లునుంచివచ్చిన శ్రీ సంస్కారకళాసమితివారు ప్రదర్శించారు. నాటకరచనలో లోపాలను నటులేమి చేయగలరు? ఆ పరిమితిలో నటులు అద్భుతంగా నటించారు. ఇంకో విశేషం ఏమిటంటే - నాటకకర్తా - ఆయన కుటుంబమూనే - ఇందులో ప్రధాననటులు. అయితే పేదపిల్ల వేసినామె - మొదట్లో అమాయికపు బాలికగా నటించబోయి వెర్రిబాగులదానివలె కన్పించినది. సుకుమార్ పాట్లు పద్యాలు లేని శుద్ధగద్యాత్మకమైతే ఇంకాబాగుండేది. నాటకం ప్రథమంలోకన్నా చివరలో రక్తికట్టింది. శ్రీనివాసరావుపంతులుకు పిచ్చిపట్టిన కుమారుణ్ణి చూచినప్పుడు హృదయం ద్రవించియున్నదికదా. ఆ పదునులో కనబడ్డ లక్ష్మి 'పాపాయి'ని చూచినప్పుడు అవ్యాజానురాగ ముదయించ లేదేమి? ఆపాపాయి 'అలక్ష్య దంతముకుళాలు,' 'అనిమిత్త హాసాలు'— తన సుకుమార్ చిన్న నాటి వన్నెచిన్నెలబోలియున్నాయని - తోచలేదా? ఆ పాపాయి 'అవ్యక్త రమణీయ వచఃప్రవృత్తి' విందామని ఆ మనసులాయనకెందు కనిపించలేదో? ఇది కవిలోపమైనా నటుడు సవరింపవచ్చు. మరి కవీ, నటుడు ఒకడై నప్పుడు అందుకింకా అనుకూలం. 'ధనికవర్గం నశించాలి' అనే నినాదం పాత్రలచేత అనిపించడం కళకు లోపం; అది సభారంగ ప్రచారం అవుతుంది. వారి చర్యలగాంచి ప్రేక్షకులు అనాలి!

10 వ తేదిన - దుర్యోధన పరాభవము, ఇద్దరు బాలికల నృత్యము. 'నేటినటుడు' అనే నాటకం - (అంటారు; నా అభిప్రాయంలో ప్రహసనం)— ప్రదర్శింపబడినది. దుర్యోధన పరాభవం - పేనే - 'నేటి నటుడు' నాటకమేమో అని నేను మొదట అనుకున్నాను - అయితే - దుర్యోధనునకైనా దీర్ఘ దీర్ఘతర, దీర్ఘతమ సమాసభూయిష్టము, క్లిష్టసంస్కృత పదసంకుల సమరసమన్వితము అయిన భాషలో ఆత్మగతోపన్యాసములు-హాస్యాస్పదము అనుకొనేస్థితిలో ఇంకా ప్రేక్షకులు లేరు. అందుచేత ఎవ్వరూనవ్వలేదు.

పిదప చిరంజీవులు సరోజ,సుధ అనే వైష్ణవబాలికలు కలిసినృత్యంచేశారు. వేషభాషలు,శిక్షణ, నేర్పుఅంతా సమానమే. అయితే వీరిలో నొకబాలిక రెండవఆమెకన్న చిన్నది. రెండవఆమె ఈ చిన్నబాలికకన్న స్థూలము; గుండుమొగము. చిన్నిబాలికఅభినయంలో చలాకీ ఎక్కువ; పెద్దబాలికకు నిదానం ఎక్కువ. రెండూ దేనికది అందమే. కాని రెంటికలయికకు - తూకం కుదరలేదు. అందుచేతనే ఒక్కొక్కరుగా అభినయించినప్పుడు, ఒకరునిల్చి ఒకరు అభినయించినప్పుడు, ఎక్కువ అందమిచ్చి, ఆనందకరమైంది. పిదప నేటినటుడు నాటకంలో శ్రీ సన్యాసి రాజుగారు అద్భుతంగా నటించారు. నాటకాలలోఉపన్యాస ధోరణి హృద్యమంకాదు. అయితే ఇప్పుడు మన నిత్యజీవితంలో అది ఒక భాగమైనది. నిత్యజీవితం ప్రతిబింబించేదే నాటకంకావునఅందులోకీ ఎక్కింది. స్థానం, గోవిందరాజులవార్లవంటివారు మెచ్చుకోవడం మర్యాద. రాజుగారు "Let him beware!" అన్నప్పుడు శోకంకంటే క్రోధంచూపడం సబబేమో!

నాటకాలకువచ్చిన ప్రేక్షకులు-రాత్రి 9-10 దాటినతర్వాత ఇండ్లకుపోవడానికి బాధపడుచున్నారన్న విషయం కళాకేంద్రం కార్యనిర్వాహకులు గమనించాలి. గమనించి అధికారుల నడిగి ఆవేళకొక అరడజను బస్సులైనా అక్కడికివచ్చే ఏర్పాట్లు చేస్తే- ఇంకా ప్రేక్షకులు హెచ్చుతారు అని నాఅభిప్రాయం. ఈసంచికముగియవస్తున్నది. కాబట్టి ఇప్పటికిది కళాదేవికి అవసరనైవేద్యం. మహానైవేద్యం రాగల సంచికలో. శ్రీస్థానంవారిప్రయత్నం ప్రశంసార్హం; కొనసాగుగాక!

# సంపాదకీయములు

## మద్రాసు రాష్ట్రానికి క్రొత్త మంత్రి వర్గం.

ఉగాది ఉగాదికి వచ్చేగండం మద్రాసు శాసనసభా కాంగ్రెసుపార్టీ నాయకత్వపు ఎన్నిక. ఈ సారి ప్రధానులు తప్పుకొని అప్రధానులను ముందుంచి జూదమాడినారు. సుబ్బరాయన్ గారితోడి కుమారస్వామి రాజాగారు గెల్చినారు. రాజాగారు ప్రధానిఅయినారు; మంత్రి వర్గాన్ని చాలావరకేర్పరచినారు. ప్రజా ప్రభుత్వంలో ఎవరు ప్రధానులైనా వారికి ప్రజలంతా సహకారం చూపవలసిందే. మంత్రి వర్గపు చర్యలను నిర్మాణాత్మకమైన విమర్శన లొనర్చడమే పత్రికలు చూపగల సహకార స్వరూపం. ఆ విధిని మేము యథాప్రకారం నెరవేరుస్తాము. అయితే ఇప్పటికి 10 మంత్రులేర్పడ్డారు. ఇంకా 4 రేర్పడతారట. ఈ పదిమందిలోనూ ఒక్క స్త్రీ లేదు. ఇక ఏర్పడబోయ్యే 4 గురిలోనైనా ఉంటార్లో ఉండరో? సభ్యులలో ఆడుసభ్యుల విలువ తక్కువ- మగసభ్యుల విలువ హెచ్చు-గాదు. ఆసంగతి ఆసుపత్రినుంచీవచ్చి ఇతరుల భుజములపైవ్రాలి నడిచి శ్రీమతి రుక్మిణీ లక్ష్మీపతిగారు ఓటువేసి నిరూపించారు. ఒక్క ఓటే తేడా అయినప్పుడైతే ఆమె ఒక్క ఓటే ఫలితానిర్ణయించేదేగదా. పార్లమెంటరీ శక్రటరీ లనేర్పరచడంకూడ ఆలోచనలో ఉన్నదట. ఆ పదవులైనా హెచ్చుగా స్త్రీల కివ్వవచ్చు. ఉన్న 5, 6 మంది స్త్రీలు సమర్థురాండ్రుగాని అసమర్థురాండ్రుగాదు. మాటవరుసకు, ఆహారమంత్రి కార్యదర్శి స్త్రీ అనుకోండి. అధికారులు గుడ్లురజేసి, ఎర్రటోపీలు చూపించి కాగుబారు చేయనక్కరలేకుండా-ఆమె ఎంతో నయతరంగా ధాన్య సేకరణ చేయలేదా? బియ్యం వగైరాల బ్లాకుమార్కెట్టు అపుచేయలేదా?

## విద్యార్థినులకు వసతి గృహాలు

మద్రాసు సిటీ ఇంప్రూవ్మెంటుట్రస్టువారు సముద్రతీరంలో రెండువసతి గృహాలను విద్యార్థినులకై కట్టుట కేర్పాటుచేయడం హర్షింపదగిన విషయం. వీటిలో 528 విద్యార్థినులకు వసతి ఏర్పడగలదట; విద్యార్థి నొక్కొక్కతె నెల 1 కి రు 10/-లు మాత్రమే గదికిచ్చుకోవలెనట. పట్నములో బాడుగలను బట్టిచూడగా ఇది హెచ్చుకాదనే యనవలయును. నిజముగా నీ ఏర్పాటు పట్నమునగల గొప్పలోటును తీర్చుచున్నది. ఇట్లే బాలురకును మరిరెండు వసతి గృహములను ఏర్పరచుట అత్యవసరము. ప్రస్తుతం ట్రస్టు వారేర్పరుప దలచినది హైకోర్టువద్ద. బాలికల వసతిగృహాలు, మైలాపూరు, తిరువల్లిక్కేణిలనంటి యుండగలవు. కావున మేము కోరునది బాలురకుకూడ ఈ ప్రాంతమున మరిరెండు అవసరములని. కాల క్రమమున అవికూడా ఏర్పడునని ఆశింతుము.

## వయోజన విద్య

వయోజనవిద్య దానంతటదియే అవసరమైనది. వయోజన నియోజక వర్గము లంగీకరింప బడుటతో దాని అవసరము ఇనుమడించింది. ఈ విషయమై డా. ఫ్రాంకులాబాచ్ గారు చెప్పిన విధానము చాలా ఉచితంగా ఉన్నది. వారు 1930 లో చదువురాని వయోజనులకు సులభంగా చదువుచెప్పే ఉపాయము కనిపెట్టారు. ఆయన అప్పటినుండి 51 దేశాలలో 90 భాషలలో ఈ ఉపాయమును ప్రవేశపెట్టియున్నారు. ఆయన మన దేశానికి ఈ పనిమీద ఇప్పటికి నాల్గవసారి రావడం. చదువుకున్న స్త్రీ పురుషులంతా సం॥న కొక్కొక్క రొక్కొక్కరికి చదువు నేర్పితే 10 సం॥లలో ఈ చదువు రాదనేమాట ఘోసిపోతుంది - అవి

ఆయన అంటున్నాడు. పురుషులమాట అట్లావుంచి స్త్రీలు అయినా ఈ విధానం అవలంబిస్తే అచిర కాలంలో పురుషులతో సమానంగానైన చదువుకున్న స్త్రీ లేర్పడుతారు.

## దిక్కులేని వారికి దేవుడే దిక్కు

దిక్కులేని స్త్రీలకు శిశువులకు ఆశ్రయంగా చెన్నపట్నంలో మరొక మందిరము ఏర్పడడము సంతోషదాయకము. దిక్కులేనివారికి దేవుడేదిక్కు. అట్లని నరుడు ఆ పని తాకితలుచుకోకుంటే కొనసాగదు. దేవుడు మానవుని ద్వారానే పనిచేసేది. ఈ సందర్భంలో శ్రీ కామరాజు నాడారుగారి అధ్యక్షత క్రింద ఒక కమిటీ యేర్పడ్డది. ఆ కమిటీ ఈ మందిరం పరిపాలిస్తున్నది. ప్రస్తుతం తమిళనాడు కాంగ్రెసు భవనం ఆవరణంలో ఈ మందిరాన్నేర్పరచారని త్వరలో శాశ్వతమైన ఏర్పాట్లు చేస్తారని అన్నారు. బాగానే ఉన్నది. మేమీకమిటీ వారికి రెండు సలహాలిస్తాము. స్త్రీలను, శిశువులను కలపకండి. దానివల్ల చాలా చిక్కులున్నాయి. మరి బహుకార్యలంపటులైన శ్రీ కామరాజు నాడారుగారికంటే మరొకరెవరైనా దీని కధ్యక్షులుగావుంటే ఏకాగ్రచిత్తముతో దీని విషయం కృషిచేయడానికి వీలవుతుంది.

## నెహ్రూ సుపుత్రుడు

పండిత జవహరిలాల్ నెహ్రూ ననేక విధాల వర్ణించవచ్చు. అయితే ఆయన అన్నింటికన్న మిన్నగా సుపుత్రుడు. కాబట్టే-పుత్రవిరహితయై కష్టించే తల్లి ఇక్కట్లు తెలుసుకోగలిగాడు. ఆ తల్లి ధారవోసుకొన్న కుమారుడు సామాన్యుడుగాడు. చంద్రశేఖర అజాద్ అను విప్లవకారుడు. 1931లో అలహాబాదునందు పోలీసుల నెదుర్కొని పోరాడి హతుడాయెను. ఆయనతల్లి 74 సం||ల ముసలిపండు; నిరాధారియై నవుస్తున్నది. నెహ్రూప్రధాని ఆమెకు ఆధరువుగా రు 250/-ల కానుక పంపాడు. ఇంకా ఏమి కావలెనన్నా చేస్తానన్నాడు. నెహ్రూ సుపుత్రుడు కాబట్టే తల్లి కొరత తెలిసి తీర్చగలిగాడు. కాబట్టి తల్లులంతా తమ సంతానాన్ని సుపుత్రీపుత్రులను గావిస్తే-వారే మంచి పౌరులు, పరిపాలకులు, ప్రయోజకులు అవుతారు. జాతిని నిర్మించేభారం తల్లిమీద ఉన్నది!

## కాన్సర్ వైద్య సహాయక నిధికి విరాళాలు.

వేరొకచో ఈవిషయమై ప్రచురింపబడిన విజ్ఞప్తిని మా పాఠకులు గమనింతురుగాక. ఈ క్యాన్సర్ వ్యాధి నిర్మూలనానికి చేసే ప్రయత్నాలను మాతోపాటు మా పాఠకులున్నూ హర్షింతురని మేమెరుగుదుము. అయితే ఆ 'హర్షము' వట్టిదిగాక - శక్తికొలది విరాళములంపి గట్టిదిగా నొనర్తురుగాక.

## వివాహ సంస్కరణముల బిల్లులు

భారతీయయూనియన్ పార్లమెంట్ పండిత ఠాకూర్ దాస్ భార్గవా వివాహసంస్కరణములగూర్చి తెచ్చిన బిల్లులపై సెలెక్టుకమిటీవారి రిపోర్టును చర్చించి తీర్మానించారు. వధువు వయస్సు పరిమితి 14 నుండి 15 కు వరుని వయస్సు 18 నుండి 20 కి మార్చుమని భార్గవాగారు సూచించగా సె. క. వారు సమ్మతించారు. కాని సభవారు వధువు వయస్సు హెచ్చించి వరుని వయస్సు అట్లే ఉంచారు. ఇది సబబే. ధర్మశాస్త్రరీత్యా, వైద్యశాస్త్రరీత్యా వధువు వయస్సు 16 ఉండవలెను. అప్పుడే యువతి అంగసౌష్టవమును పూర్తిగాకలిగి సత్వసంపన్నమైన సంతానము కననేర్చును. మలబారులోగల వివాహనియములు స్త్రీస్వాతంత్ర్యము కారణములుగా స్త్రీకి బాగుగా వయస్సు వచ్చిన తర్వాతగాని వివాహప్రయత్నముదయించదు. నేడు స్త్రీలు విద్యావతులై సంపాద్యపరులైగాని వివాహమొనర్చుకొనుటలేదు. అట్టి వయఃపరిపాకమున కన్న సంతానమగుటచేతనే విద్యావంతులు, ప్రజ్ఞావంతులునైన కేరళసోదరులు నేడెల్లెడల ముఖ్యరాజకీయోద్యోగులై మెరయుచున్నారు. రైలుకు దూరముగానున్న రెడ్లు కమ్మవారు వ్యవసాయ కార్యములందు స్త్రీపురుషులు కలిసిమెలిసి పనిచేయుచు బాగుగావయస్సువచ్చిన పిదపగాని వివాహప్రయత్న మొనర్పరు. కావున వారికి దృఢకాయులు, ఆజానుబాహులు, పనిమంతులు పుట్టుచున్నారు. కాబట్టి స్త్రీ-బాగుగా వయస్సువచ్చిన పిదపనే వివాహమొనర్చుకొనుట న్యాయము. బాల్యవివాహములు అగ్రజాతులలోను ధనాఢ్యులలోను మాత్రమే ప్రబలియున్నవి. అయితే ఒక్కసారిగా 14 నుండి 16 చేయక ముందు 15 చేయుట న్యాయము. పిదప 16 చేయవచ్చును. 16 అయిన పిదప హెచ్చింప నికపనిలేదు. దానంతటదియే-20, ఆపైన నగును. ఈ చట్టము నుల్లఘించుట న్యాయవిచారణకు తేవలసిన (cognisable) నేరముగా చేయుమని భార్గవాగారు కోరినను, సెలెక్టుకమిటీలో అధికసంఖ్యాకులు సమ్మతించినను శాసనసభవారు నిరాకరించుటయు మంచిదే. అట్టిది సంఘములో కల్లోలము తెచ్చును. సాంఘిక విషయములలో చట్టమొనర్చుట అనివార్యమైనను ప్రజాభిప్రాయముమీద నది అమలు జరుగవలెనుగాని భయమువల్లగాదు. 18 సం॥ల లోపు వధువును 45 సం॥ల పైని వరుడు వివాహము చేసుకొనరాదని మరియొక క్లాజును భార్గవాగారు సూచించిరి; దీనిని సెలెక్టుకమిటీవారు నిరాకరించిరి. ఇది సబబుకాదు. భార్గవాగారు 45 సం॥పై బడ్డ పురుషపుంగవులను వివాహమాడరాదనలేదు. అట్టివారు 'గంతకు తగిన బొంత'యన్నట్లు 18 సం॥లపై బడ్డ వధువులను వరించదగునన్నారు. 27 సం॥ తేడాకూడ చాలదా? 45 సం॥ల వారు అనేక కారణములచే 18 సం॥ల లోపు పడుచులను వివాహమాడుట కవకాశమున్నప్పుడు-అంతకన్న వయస్సు దాటిన కన్యలు, వితంతువులు చాలవరకు అవివాహితలుగానే యుండవలసి వచ్చుచున్నది. ఎన్నిచట్టము లొనర్చినను తీవ్రమగు ప్రజాభిప్రాయమువల్లనే ఇట్టి పనులు జరుగునని పైననే చెప్పితిమి. అట్టి ప్రజాభిప్రాయము నేర్పరచు పని మహిళా సంఘములదైయున్నది. కాన పట్టణములకు తాలూకాలకు ఇట్టి సంఘము లేర్పడి ప్రతివివాహము విషయమునను పరిశీలన మొనర్చుట ప్రచారము గావించుట వారివిధి.

## ఆంధ్ర రాష్ట్రం

భాషాప్రయుక్త రాష్ట్రముల విషయమునిర్ణయింప నేర్పడిన పటేలు పట్టాభి నెహ్రూ కమిటీవారు ప్రస్తుతము కాదని మొత్తముమీద తీర్మానించి వివరముగా వివిధరాష్ట్రముల సంగతి చర్చించుచు ఆంధ్రరాష్ట్రమును వెంటనే నేర్పరచవచ్చును అని సూచించినందుకు సంతోషమే. కాని అందుకు నియమించిన షరతులు మాత్రము ఆ సంతోషమును మాయమొనర్చుచున్నవి. చెన్నపట్నముపై, వివాదగ్రస్తములగు సరిహద్దు ప్రాంతములపై హక్కు ఇప్పటికి వదులుకోమన్నారు: ఇన్నాళ్లున్నూ ఆయాప్రాంతములందు మాతృభాషను కాపాడుతున్నది. వీధిలో తిరుగ నేర్చిన పురుషులుకాదు; వంటఇంటనున్న గృహలక్ష్ములే. అయితే నేడిక నీ గృహలక్ష్ములు మాతృభాషను కాపాడుట కష్టతరము. కావున వీరు నిర్ణయించిన ఈ షరతులు చాలా అక్రమములైనవని మా అభిప్రాయము. పెద్దలు పునరాలోచించి తిరిగీ నిర్ణయింతురుగాక




**జయశ్రీ:** సంపాదకురాలు: యం. విజయలక్ష్మీదేవి. 43 వి. బి. వీధి మద్రాసు. సం॥ చందా రు 3-0-0 లు.

స్త్రీలకొరకు ఏర్పడిన క్రొత్త మాసపత్రిక. దీనికి నారీమణియే సంపాదకురాలు కావడం సమంజసమే. పండిత రమాబాయిగారి జీవితచరిత్ర కొన్నికథలు పాటలు పద్యాలు ఇందుఉన్నాయి. దీక్షగాపనిచేస్తే-ఈ పత్రికకు పురోభివృద్ధిఉన్నదని తోస్తున్నది.

**సంఘం:** సంపాదకుడు: గోపరాజు రామచంద్రరావుగారు ఎం. ఏ. పటమట, విజయవాడ. సాలుచందా: రు 5-0-0.

పూర్వపురోజులలో సంఘవిప్లవకారులు కందుకూరి వీరేశలింగంపంతులు, దేశిరాజు పెదబాపయ్యగార్లు. ఈకాలంలో గుడిపాటి వెంకటచలం, గోపరాజు రామచంద్రరావుగార్లు. అయితే ఉభయులవీ భిన్నపథాలు. రామచంద్రరావుగారు నిరీశ్వరవాది. కాని ఎందరో ఈశ్వరవాదులకన్నా కరుణార్ద్రహృదయుడు; సత్యవంతుడు; ఉత్తముడు. ఆయన వాదనలతోను సిద్ధాంతములతోను మనమేకీభవింపకపోవచ్చును. ఆయన సద్బోధనలలోఉండే సత్యం గమనింపకుండజాలము; గ్రహించకతీరదు. అందుచేతనే ఆయన పరమ ఆస్తికుడైన గాంధీజీకి సన్నిహితుడుకాగలిగినాడు. పూర్వం గాంధీ ప్రథమశిష్యులలో కీ॥ శే॥ దిగుమర్తి హనుమంతరావుగారు నిరీశ్వరవాది. ఆయన గాంధీజీకి చాలా సన్నిహితుడు. ఔషధసేవ విషయంలో తనసిద్ధాంతం తాను ఆచరణలోపెట్టజాలకపోయినా హనుమంతరావుగారుమాత్రం ప్రాణాంతకానికైనా అంగీకరించి పెట్టగలిగినారని వారిమరణానంతరం వారినభినందించినాడుగాంధి. కాబట్టి తెలుగుదేశపు 'వెర్రివాండ్రి' సత్తువ తెలిసేరామచంద్రరావుగారిని దగ్గరచేర్చుకున్నాడు. రామచంద్రరావుగారు మాటలమనిషికాదు; తనకుమార్తెను హరిజనునకిచ్చి వివాహమొనర్చిన సాహసికులు. అట్టివారు సాంఘికవిషయములలో తమకుగలనూతన "దృక్పథమును ప్రజావిమర్శకు, సవరణకు అనుసరణకు బహిరంగ పరచుటకుగాను" 'సంఘం' అనే వారపత్రిక నడుపుచున్నారు. మీకు నచ్చనీ నచ్చకపోనీ; మీరాచరింతురుగాక, మానుదురుగాక; ఆయనరచనలో జీవంఉంటుంది; పాఠకులున్నూ ఆశక్తిఉంటే ఆలోచించక తప్పదు.

**మాతృభూమి:** తృతీయజయంతి సంచిక, బెజవాడ. వెల రు 1-0-0.

మాతృభూమిపత్రికకు రెండుసం॥ లు నిండినవి. మూడవసం॥ ఆరంభమైనది. ఈరెండుసం॥ల లో యస్ప్లనేడ్ నుండి త్యాగరాయనగరం, అక్కడనుండి విజయవాడ మాతృభూమి బదిలీఅయింది. అయినా రూపుచెడలేదు. స్వభావంమారలేదు. సర్వాంగసుందరంగా ఈ జయంతిసంచిక తయారైంది. సంపాదకులు ప్రధాన సంపాదకీయంలో "గాంధీజం ఒక్కటే శరణ్యం అని నమ్మినవాడను" అన్నారు; లోపలవ్యాసాలు 'సోషలిజం' ను కూడా గుబాళిస్తున్నవి.

**ఆంధ్రజ్యోతి:** ఉగాదిసంచిక: 37 ఆచారప్ప వీధి. జి. టి. మద్రాసు. వెల రు 1-0-0

అందచందాలతో తయారైనదీ "ఆంధ్రజ్యోతి ఉగాదిసంచిక." ముఖచిత్రంలో అమాయికులైన రైతు

దంపతులు. లోకంలో వీరిపేరటజరిగే గొడవంతా వీరికేమన్నా తెలుసునా అన్నట్లున్నారు. అన్నీకథలే. కథలకు తగినబొమ్మలు. 162 పుటలగ్రంథం. సంపాదకీయంలోమాత్రం ప్రపంచపరిస్థితులు సమీక్షించారు. ఇంతశ్రమతో ఈ సంచికతయారుచేసినవారు అభినందనీయులు.

**సర్వోదయ: సంపాదకులు: శ్రీమైనేని రామకోటయ్య,వల్లభనేని వెంకటరత్నప్రసాద్‌గార్లు, విజయవాడ. విడిపత్రిక 0-2-0**

ఈపత్రికసంపాదకులుగా ముఖపత్రమున పైవారిపేరులున్నవి, వెనుకభాగమున Edited and Published by Kasi Viswanadam (శ్రీ కాశీ విశ్వనాథంగారిచే సంపాదింపబడి, ప్రకటింపబడియె) అని ప్రకటింపబడినది. దీని తిరుగుడేమో? ఇది 'యువజన వారపత్రిక,' అని వారే ముఖపత్రమున ప్రకటించుకొన్నారు లోపలంతా సోషలిస్టుపార్టీ గొడవ. ఆపార్టీ భవిష్యత్తుమీద ఆధారపడి యుంటుంది ఈ పత్రిక భవిష్యత్తు. కొంతవరకు ఆపార్టీభవిష్యత్తును తెలుగుదేశంమేరకైనా ఇదినిర్ణయిస్తుంది.

**జనవాణి సంపాదకులు: శ్రీ తాపీ ధర్మారావుగారు. మైలాపూరు మద్రాసు. సం॥ చందా: రు 10-0-0. అర్ధసం॥ చందా రు 5_8_0 విడిపత్రిక 0-3-0**

శ్రీ తాపీ ధర్మారావుగారు, గొప్పవిద్వాంసులు, కవులు, పత్రికారచయితలుగా సిద్ధహస్తులు. వారు కాన్ఫ్రెన్సు గతించిన పీపిల్స్‌పార్టీపేర నడిపిన తెలుగు దినపత్రికపేరే ఈ క్రొత్త వారపత్రికకుకూడా పెట్టినారు. అట్లని - పూర్వము దానిని విడిచినపిదప చేబట్టిన "కాగడా"ను మరువలేదు; విడువలేమ యంటున్నారు. ఈయనదొక స్వతంత్రపంథా. విమర్శ నిరంకుశం. అయితే "గాలించినా లాలించినా వ్యక్తినిబట్టికాదు; శక్తినిబట్టి"—అని ఆయన సంపాదకీయములో చెప్పినమాట వాస్తవం. ఇక లోకో భిన్నరుచిః', అన్నారు. "పుర్రెకోకబుద్ధి". ఒకడికి నచ్చినది, మరొకనికి నచ్చదు. పత్రికలలో కవిగారు నవరసాలుగుప్పిస్తారు. నిజంగా -"వెర్రి వెధవ" శబ్దార్థ శబ్దస్వరూపశబ్దవిచారమును-అంతదూరం తరచగల వారికలం చురుకు, చొరవ, చాకచక్యము, చాతుర్యము చోద్యమైనవి. పదికాలాలు నడిచేపత్రిక.

**మన్యం కంపెనీవారి 1949_50 క్యాలెండర్: రాజాసోప్ బిల్డింగులు బెంగుళూరు.**

రాజాసోప్ మున్నగు అంగరాగములు అగరువత్తులు, తయారుచేసి విక్రయించే మన్యంఅండుకోవారి క్రొత్తకాలెండరు విమర్శనార్థము మా కార్యాలయమునకంపగా కృతజ్ఞతతో స్వీకరించాము. డబుల్‌డిమ్మీ సగముసైజులో పెద్దపెద్దగళ్లతో, పెద్దఅంకెలతోనున్నది. గోడమీదికాలెండర్‌ను దూరంనుంచీ చూచి అయినా తేదీతెలుసుకోవచ్చు. గృహలక్ష్మి పూలరెక్క, పాలరెక్క, చాకలి రాకపోకలు, . గుర్తువ్రాసి పెట్టుకోడానికివీలుగా ఉన్నదీక్యాలెండరు. ఇందులో దేశీయపంచాంగములననుసరించి మార్చి (1949)-మొదలు ఫిబ్రవరి (1950) వేయడం బాగున్నది.

**క్రొత్త పంచాంగాలు. (1) విద్వాన్ తొగర్చేటి భాస్కరశాస్త్రిగారు, వారి పుత్రులు సోమసుందరశాస్త్రిగారు గుణించినది. ఆదోని. (2) శ్రీ కే. యం. రామమూర్తి శర్మ సిద్ధాంతిగారిచే గుణింపబడినది; వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండుసన్స్, మద్రాసు వారిచే ప్రకటితము. వెల రు 0_6-0 లు.**

శ్రీ విరోధి నామసంవత్సర పంచాంగములు పై రెండున్నూ మా కార్యాలయమునకందినవి. ఇందు

సిద్ధాంతపంచాంగము గుణితము. ఇందలి ఉపోద్ఘాతమున గృహస్థులకు ముఖ్యంగా తెలియనవసరమైన జనన కాంతి నక్షత్రములు, కన్యాజన్మ నక్షత్రదోషవిచారము, ప్రథమ రజస్వలాదోషనక్షత్రములు, బాలారిష్ట దోషములు, ముహూర్తములకు శుభదిననక్షత్రములు, రాహుకాలము, బల్లిపతనము మున్నగు వివరాలెన్నో యున్నవి. ఈపంచాంగమును ప్రాచీనములవలె హాల్కికాగితముపైగాక కొంత మంచికాగితముపై పుస్తకము సైజున అచ్చొత్తించియున్నారు. మరియు వాటియందువలె ఇందు అశ్లీలములు, నసహ్యాకరములునైన ప్రకటనలు లేక, పండితులు గృహలక్ష్ములు, గృహస్థులునిది చేతబట్ట యోగ్యముగానున్నది.

(2) లోకమాన్య బాలగంగాధరతిలక్ మహారాజు గొప్ప రాజకీయనాయకుడేగాక విజ్ఞానధనుడనిన్ని అందరికీ తెలియునుగదా. ఆయన తనరాజకీయకార్యములమధ్య తెరిపిచేసుకొని - దైవజ్ఞులను సిద్ధాంతులను పునహోకాహ్వానించి సభలుగావించి జ్యోతిషసిద్ధాంతములలోని లోపముల నందు చర్చింపజేసి సిద్ధాంతీకరింప జేసిన మహనీయుడు. అట్టివానిపేర ఇదిమొదలుగా ప్రతిసం॥ మును పంచాంగమును ప్రచురింపబూనుట ప్రశంసార్హము. ఇందును పైభాగములోకన్న విశేషాంశములు ప్రకటింపబడినవి. ఇది దృగ్గణిత సిద్ధాంతముల రెంటిని తెల్పు పంచాంగము. చక్కనికాగితములపై విడివిడిగా అచ్చొత్తించి ప్రచురించిరి. ముఖపత్రమున గంభీరమగు లోకమాన్యని చిత్రము ప్రచురింపబడియున్నది. మామూలుగ పంచాంగములలోవలె అధునికులకు అనభ్యస్తములగు తెలుగుఅంకెలు గాక ఇంగ్లీషుఅంకెలే ఇందువాడబడినవి. ప్రతిఇంట నుండదగిన పంచాంగము.

మంజూష: సంపాదకులు: శ్రీ కొమ్మూరి సాంబశివరావుగారు. నెం. 19-A మసీదువీధి సైదాపేట, మదాసు. సం॥ చందా 4-8-0.

"కథలమాసపత్రిక." 42 పుటలు: నాల్గుకథలు. కథలు అసామాన్యంగా వ్రాయబడినవిగావు; శిల్ప దృష్టితో నేర్పుగా వ్రాయబడినవి. చిన్నకథలలో అపమార్గం త్రొక్కినవారిమీద సానుతాపం కల్గించడంలో ఉన్నది శిల్పినేర్పు. కథకుల పేర్లు లేకపోవడం, పైఅట్టల లోవైపులకూడా కథలకే ఉపయోగించడం - కథల కనుగుణ్యమైన చిత్రాలు - మంచిలక్షణాలున్నాయి ఈపత్రికకు. అయితే ముఖచిత్రం కొంతవెక్కసంగా ఉన్నది. నేడేవీధివెంగన చూచినా ఇవేబొమ్మలుగదా గోడలమీద మేడలమీద అంటారేమో! అభిరుచిని కించపరచడం జాత్యాభివృద్ధికరంగాదని మామతం.

# శ్రీ విరోధినామ సంll చైత్ర, వైశాఖ మాసములు.

చైత్ర

1949-వ సంll

| | | |
|---|---|---|
| 16 | శ | బ. చ. 49-36 అను 28-54 రా 11-44 సంకటహర చవితి. |
| 17 | ఆ | ప. 47-15 జ్యే 27-55 రా 17-2 మత్స్యజయంతి. |
| 18 | సో | ష. 46-10 మూ 29-8 దివ 24-6 రా 21-44. |
| 19 | మం | స. 46-10 పూ. షా. 29-33. |
| 20 | బు | అ. 47-38 ఉ. షా 32-10 రా 11-42. |
| 21 | గు | న. 50-1 శ్ర 35-52 రా 15-31. |
| 22 | శు | ద. 53-20 ధని 40-29 రా 28-58. |
| 23 | శ | ఏ. 57-20 శ 45-49 స్మార్తైకాదశి. |
| 24 | ఆ | ద్వా. 60-10 పూ. భా. 51-40 ది 3-15 మాధ్వవైష్ణవైకాదశి. |
| 25 | సో | ద్వా. 1-53 ఉ. భా. 57-44 ది 17-59 వరాహ జయంతి. |
| 26 | మం | త్ర. ద. 6-30 రే 60-10 ది 30-42 |
| 27 | బు | చ. ద. 10-59 రే 3-41 రా 27-11. [ఘటాదినాడా యోగకాలః |
| 28 | గు | ● అమా. 15-4 అశ్వ 9-17 రా 4-2 వైశాఖస్నానధర్మ |

## వైశాఖ మాసము.

| | | |
|---|---|---|
| 29 | శు | శు. పా. 18-29 భ 14-17 రా 15-6. |
| 30 | శ | వి. 21-3 కృ 18-27. |
| 1 | ఆ | త 22-25 రో 21-37 రా 4-43 పరశురామజయంతి. |
| 2 | సో | చ. 22-55 మృ 23-38 రా 13 32. |
| 3 | మ | పం. 21 59 ఆ 24-25 రా 22-50 శంకరజయంతి. |
| 4 | బు | ష. 19-49 పును 24-0 రా 12-2. |
| 5 | గు | స 16-29 పుష్య 22-25 రా 21-36 గంగోత్పత్తి. |
| 6 | శు | అ 12-7 ఆ 19-48 రా 16-27 వీరబ్రహ్మారాధన. |
| 7 | శ | న. 6-51 మ 16-20 రా 3-27 కర్తరీప్రారంభం కందిమల్లయపల్లె |
| 8 | ఆ | ద. 0-54 ఏవ్యం 53-30 పూ. ఫ. 12-15 దివ 28-57 స్మార్తైకాదశి. |
| 9 | సో | ద్వా. 47-53 ఉ. ఫ. 7-47 దివ 27-14 మాధ్వవైష్ణవైకాదశి. |
| 10 | మం | త్ర. ద 41-25 హ 3-12 ది 21-42. |
| 11 | బు | చ. ద. 35-20 స్వా 54-40 ది 11-37 నృసింహజయంతి. [గరుడోత్సవం. |
| 12 | గు | ○ పౌ. 29. 51 వి 51-56 ది 7-47 వ్యాసపూర్ణిమ, కంచి వరదరాజస్వామి |
| 13 | శు | బ. పా. 15-14 అను 49-4 ది 0-54. |
| 14 | శ | వి. 21-38 జ్యే 47-49 ది 2-38. |
| 15 | ఆ | త. 19-10 మూ 47 44 ది 7-40. |

Printed and Published by Dr. S. Seshagiri Rao at the Lodhra Press, Kesari Kuteeram Ltd,
15, Westcott Road, Royapettah, Madras. Editor : Dr. K. N. Kesari.

# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్యసౌభాగ్యములను పెంపొందించుట
కేర్పడిన సచిత్ర మాసపత్రిక


సంపాదకుఁడు :

డాక్టరు కే. యన్. కేసరి


# GRIHALAKSHMI


ఏప్రిల్, 1949.

సంపుటము ౧౮] [సంచిక ౪




### సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు.4-8-0. అర్థసంవత్సరపు చందా రు.2-8-0. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతిలేదు. విడికాపి ఆరు అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువమేరకు తపాలాబిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

### ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీలకందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుటకీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువయైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది.

### వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమైయుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్రి ప్రచురణకు వీలగును. ఒక్కేపక్క సిరాతో స్పష్టముగ తప్పులులేక వ్రాయవలెను. భాష గ్రాంధికముగాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వహక్కులు గలవు. ప్రకటింప నంగీకరింపబడినపుడు మాత్రము రచయితల కట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

### సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

### చిరునామా మార్పు

చిరునామాయందు మార్పుఉండుచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

### ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయును. చెక్కులు,మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం లిమిటెడ్' పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.

# గృహలక్ష్మి ఏజంట్లు:



గుంటూరు: వెల్‌కం & కో.
కర్నూలు: బాలసరస్వతి బుక్ డిపో.
బెజవాడ: మాడర్న్ న్యూసు ఏజన్సి.
కాకినాడ: పి. సాంబయ్య
అనంతపురము: వై. సాంబయ్య.
భద్రాచలం: టి. వి. జి. ఆర్. మూర్తి.
దొమ్మగూడెం: సి. హెచ్చి. బాపనయ్య.
నర్సాపూరు: వై. సుందర్రామయ్య.
కావలి: జి. రంగయ్య.
మారుటేరు: వి. వి. సుబ్బారావు.
గుడివాడ: యం. రామమూర్తి పంట్.
పిఠాపురము: యం. సూకరాజు.
కళ్యాణదుర్గం: కె. మల్లప్ప.
నిడదవోలు: కె. సి. సి. అయ్యర్.
మచిలీపట్నము: టి. బి. నారాయణశింగ్.
ఏలూరు: నేషనలు బుక్కుడిపో.
రాజమండ్రి: నేషనల్ ఏజన్సీస్.
తుని: కోడూరు సూకరాజు.
బరంపురం : కె.వి.రంగారావు.
విశాఖపట్నం: కె. సుందరేశ్వర్రావు.
కనిగిరి: కె. యస్. శాస్త్రి
పర్లాకిమిడి: బి. యన్. మూర్తి.
ఇచ్ఛాపురం: కె. గంగయ్య
బళ్ళారి: యస్. గురునాథ్
అనకాపల్లి: పి. వీరునాయుడు.
విజయనగరము : పి. నారాయణప్పడు.
ఆకీడు: వి. లక్ష్మీనారాయణ
భీమవరం: యన్. సూర్యనారాయణ.
పొన్నూరు: చౌదరి ఖాదీస్టోర్సు
మదనపల్లి: యన్. రాధాకృష్ణయ్య
అంబాజీపేట: పి. రామమూర్తి.
చికాకోలు: బి. యన్. మూర్తి.
వసంతవాడ: యస్. కె. శర్మ.
ఖర్గపూరు: యస్. వి. నాయుడు.
పార్వతిపురము: ఎ. వి. వి. యన్. మూర్తి.
తిమ్మనచర్ల: రాయలసీమ న్యూసుమార్టు.
వాల్తేరు: సిటి న్యూస్ ఏజన్సి.
చల్లపల్లి: బి. ఆంజనేయులు.
జగత్యాల: కాసం, శివరాజగుప్త & సన్సు.
రంగూన్: నేషనలుస్టోర్సు.
ఎలమంచిలి: కె దేముళ్ళు.
బాపట్ల: యల్. వి. మనోహరరావు.
నర్సీపట్నము: సి. రామం.
జంషెడ్‌పూర్: యం. శ్రీరాములు.
తాడేపల్లిగూడెం: జి. సూర్యరావు.
మహబూబ్ నగర్ : ముత్యాలు & సన్సు.
వేలూరు: ఎ. వెంకటశాస్త్రిగారు.
హైదరాబాద్ : నవ్యాంధ్రా ఏజన్సీస్.
కదిరి: జి. సి. కోదండరామయ్య.
గోకవరం: వి. వి గోపాల్ రావు.
పామర్రు: జి. లక్ష్మయ్య.
ఛత్రపురం : వి. వి. రంగాచారి
డోర్నకల్లు : కె. జె. జి. సుందరం.
చోడవరం : పి. విశ్వేశ్వర్రావు.
తిరుపతి : ఆర్. చంచల్ రావు
చీరాల. పి. సూర్యనారాయణ

హిగిన్‌బాథమ్ స్టాలులవద్ద దొరకును.

ఇతరచోట్లకు ఏజంట్లు కావలయును; డిపాజిటుతో దరఖాస్తుపంపుకొనుడు.

# విషయసూచిక

REGD. NO. M. 4793

*An ideal Combination of Beauty-Aids!*









రాజా
స్నో
హేరాయిల్
కస్తూరిసోపు
బ్రిలియన్‌టైన్







**MANYAM & CO.,** Bangalore – Madras
Madura – Bombay.
















రాజా
స్నో
హేరాయిల్
కస్తూరిసోపు
బ్రిలియన్‌టైన్

MANYAM & CO., Bangalore – Madras
Madura – Bombay.